త్వరలో వచ్చుచున్నది!

# కాంచనద్వీపం

రాబర్ట్ లూయీస్టీవెన్సన్



[illegible] రామమోహనరావు

వెల రూ. 1 80

పోస్టుఖర్చులు ప్రత్యేకం

## ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 ఏప్రెల్, 1952 సంచిక 4

విడిప్రతి వెల ఒకరూపాయి



# విషయా[illegible]క

## ఏప్రిల్



త్రివర్ణ చిత్రము—పితృహృదయం (హిమవంతుడు-గౌరి) చిత్రకారుడు · మొక్కపాటి కృష్ణమూర్తిగారు

---




నందన
చైత్రము

# భారతి

సంపుటము 29
సంచిక 4


## ఉగాది

★


శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు


మానస హంసమా! కదంబమా! అదిగో మన 'నవ్య నంద' నో
ద్యానవనంబు, కమ్మని లతా సుమపత్ర ఫలాననంబు,
మేధానిధులైన పెద్దలు సుధామధురోక్తులతో నొసంగు స
న్మానము లందికొన్నది సుమా? అనుమానము లేదు ప్రాణమా!

తీయని నీరు పారెడి నదీతటిఁ జల్లని పిల్లగాలిలో
హాయిగ సేయవచ్చును విహారము, చిక్కని కల్ప భూరుహ
చ్ఛాయల విశ్రమించి వినఁ జాలెద వింపుగ గున్నమావిపై
కోయిల కన్నియల్ వలపుఁ గుల్కుచుఁ బాడెడు జాలిపాటలన్.

మేలి పసిండి వన్నియల మించిన మేనుల నాజుకాలముల్
రాలుచుఁ దేలుచుండు ఫలరాసులు 'రాసులు' గోచరించు-ఈ
వాలుగరమ్ము లిమ్ము తెలవారుచు నున్నది-రాజనాలు ము
త్యాలలరారు చుండును గదా? 'నవనందన' గర్భ సీమలన్

ఆరగింతువు గాక నోరూరు రుచులతో
నోల లాడెడి రాజనాల పంట
అనుభవింతువు గాక యమృత మాధురి మించఁ
జవులూరు కామధేనువుల పాఁడి
ఆనుచుందువుగాక నానాలతాపత్ర
సుమపరీమళ ఘుమం ఘుమల హాయి
విశ్రమింతువు గాక విమల గంగానదీ
సైకతస్థలములఁ జల్లగాలిఁ

గాంచెదవుగాక కన్నుల కఱవు దీరఁ
గ్రమ్మికొని మేలుఁ గూర్చు యోగముల మహిమ
కదలు మెదురౌనదే శుభగ్రహ మయంబు
నవకళాసదనంబు, 'నందన' వనంబు

కోమలమై, ఫలసస్య
శ్యామలమై, సత్యశాంత శమదమ గుణ సం
ధామంబై, 'నందన' వన
సీమ, సమస్త ప్రశేష్టసిద్ధుల నొసఁగున్



# ధరల తగ్గుదల



శ్రీ పి యస్ ప్రకాశరావు

ఈ నెలనాళ్లలో తలవనితలంపుగా దేశమంతటా అన్ని వస్తువులకు (కొన్ని కంట్రోలు వస్తువులకు తప్ప) ధరలు పడిపోయాయి. కొంచెం ఎరిగి పడినంత తీవ్రంగా యీ ఒడుదుడుకు సంభవించడంచేత, మితుబడి వ్యాపారులనేకమంది హా కోవిగ్గ అన్నారు అనేక కోట్ల రూపాయల నష్టం సంభవించింది జట్టీవ్యాపారం, దాదాపు స్తంభించిపోయింది బొంబయి కలకత్తా మొదలగు చోట్ల నుంచి బంగారు మార్కెట్లు మొన్న మొన్నటివరకూ మూసివేయబడే ఉన్నాయి మాట నమ్మకంమీద అప్పు సొప్పు తెచ్చి వ్యాపారం సాగించే పెద్దవర్తకులలో కొందరు ఆ అప్పు తెగగొట్టారు మరికొందరు నాయిదాపై సరుకు బేరంచేసి, వ్యాపారనీతికి విరుద్ధంగా ఆ సరకు కొనడం విరమించుకోవడమో, కొన్న సరకు డబ్బుయివ్వలేక పోవడమో జరిగింది

ఈ విపరీత పరివర్తనకు మిగతా కారణాల సంగతి ఎలా ఉన్నా, వ్యక్యతేటల్లే ప్రధాన కారణమనడం నిర్వివాదం అంతర్జాతీయ రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పుగాని, వ్యాపార రంగంలో వచ్చిన మందగ్యంగాని లెక్కచేయకుండా, కొరియాయుద్ధంనాటినుంచి, లాభాలు గడించడం మరిగి ఆ అలవాటు ప్రకారమే సరకుకొని నిల్వచేశారు ఎంతకాలం ఓపికపట్టిచూచినా తాము కొన్న ధరకంటె యెక్కువ ధరకు అమ్ముకొనే దారి కన్పించలేదు ఒక్కసారి గుప్పుమన్నది

కించిత్తు దూరదృష్టితో వ్యవహరించి ఉంటే ధరలు అమాంతంగా గాక, మిగతా దేశాలలో మాదిరే క్రమేపీ తగ్గడానికి అవకాశముండేది కొరియాయుద్ధంలో పెరగడం ప్రారంభమై 1951 ఏప్రెల్, మేనెలల్లో ఆకాశాన్నంటిన ధరలు 51 జూన్ నెలాఖరులో సోవియట్ రష్యా కొరియాయుద్ధవిరమణ ప్రతిపాదించిన క్షణంనుండీ కొంచెం తగ్గుముఖం చూపాయి ఈ ప్రతిపాదన వచ్చిన మరువాటికే, వివిధదేశాలలో యుద్ధావసరమైన ముడిసరుకుల ధరలు ఒక మెట్టు దిగాయి

సైనాపై దాడిచేసి ప్రపంచయుద్ధం తెచ్చిపెడతాడనుకొన్న జనరల్ మెకార్థర్ బర్తరఫ్ కావడం, ఆ తరువాత కొరియాలో యుద్ధవిరమణ జరగడం, పాన్‌ముంజాం ఆక్ సంధిసంప్రదింపులు ఫలిస్తాయని పదేపదే అమెరికన్ నాయకులు ప్రకటిస్తూండడం వీటన్నింటివల్ల కొరియాలో తిరిగియుద్ధం రకపోవచ్చునని, అనగా వచ్చినా మునుపటంత భారీ ఎత్తున జరగదని ఒకవిధమైన నమ్మకం యేర్పడింది. కొరియాయుద్ధమూ, దాంతోపాటు, అంతర్జాతీయ ఉద్రిక్తత వెనుకపట్టడంతో, యుద్ధావసరాల నిమిత్తం అయినకాడికి తెగబడి సరుకులు కొనటం అమెరికా తగ్గించింది ఆర్థిక చిక్కులవల్ల బ్రిటన్ గూడా అమెరికాను అనుసరించింది పైపెచ్చు యీ ఉభయ దేశాలు, లోగడ తాము కొన్న ముడిసరుకులను, వస్తువులను, తిరిగి అమ్మివేయడం గూడా సాగించాయి. ఏ సరకైనా, ఎంత ధరైనా మిగతా దేశాలకు అందకుండా కొని నిల్వచేసే అమెరికా మార్కెట్ పోటీ నుంచి తప్పుకొనడంతో సరకులకు గిరాకీ తగ్గటం సహజం దీనికితోడు ముఖ్యావసరమైన ముడిసరకుల ఉత్పత్తి గూడా హెచ్చింది 1950 - 51 కంటె 51 - 52 లో రగి 5%, ఇనుము ఉక్కు 10%, బొగ్గు 10% తుత్తునాగం 5% సహజంగా లభించే రబ్బరు 150 వేల టన్నులు, కృత్రిమపు రబ్బరు 8 లక్షల టన్నులు అధికంగా ఉత్పత్తి అయినాయి అటు యూరప్‌లో ఫ్రాన్సు జర్మనీలు, యిటు దూరప్రాచ్యంలో జపాను పారిశ్రామిక దేశాలుగా తిరిగి తల ఎత్తుతున్నాయి కొరియాయుద్ధం మూలంగా బలపడిన జపాను ఉత్పత్తి, యించుమించు రెండవప్రపంచ యుద్ధాత్పూర్వపుస్థాయికి వచ్చింది ఇలా ముడిసరుకుల సప్లై, పారిశ్రామిక వస్తూత్పత్తి పెరగటంవల్ల ఏ దేశానికాదేశం ఎగుమతి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడానికి దిగుమతులను తగ్గించుకోవడానికి మొదలెట్టాయి

అమెరికా బ్రిటన్లు సహా అనేక దేశాలు చీప్ మనీ పాలసీలకు స్వస్తిచెప్పి, బ్యాంకు రేట్లను పెంచడంతో, మార్కెట్లో పరపతి బిగిసిపోవడం, యూరప్ దేశాలలో వ్యాపార లావాదేవీల చెల్లింపు గడ్డుసమస్యగా తయారవడం యిత్యాదులన్నీ ధరల తగ్గుదలకు దోహదంచేశాయి

1951 ద్వితీయార్థ భాగంనాటి ధరలకు 1952 ఫిబ్రవరినాటి ధరలకు పోల్చిచూస్తే పత్తి ధర 21%

ఉన్ని 59% రబ్బరు 58% జనపనార 60% చొప్పున బాగా తగ్గిపోయినట్లు స్పష్టమౌతుంది ఈ తగ్గుదల క్రమేపీ సంభవించిందన్న సంగతి గమనించాలి

కాని మనదేశంలోమటుకు యిందుకు విరుద్ధంగా ఒక్కసారి అమాంతం పడిపోయాయి ఈ పడిపోవడానికి పైన పేర్కొన్న అంతర్జాతీయ వ్యాపార పద్ధతులేగాక, మన దేశపరిస్థితులు గూడా కారణం ఇంతవరకు మనదేశంలో చీప్‌మనీ పాలసీ అమలులో ఉంది తక్కువ వడ్డీకి బ్యాంకులు ఎంతకావలిసే అంతా రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, లేక ఎప్పుడుబడితే అప్పుడు ప్రభుత్వ ఋణపత్రాలు అమ్మి వ్యాపారానికి మదుపుపెట్టాయి బ్యాంకులు విరివిగా అప్పులివ్వడంచేత తాహతుమించిన స్పెక్యులేషన్ దేశంలో తలయెత్తింది యుద్ధసరకులలో మొనాపాలీ ఉన్నంతవరకూ అమెరికా భరీ కొనుగోలుదారుగా మార్కెట్లో నిలబడ్డంతవరకూ, యీ స్పెక్యులేషన్ నిరాఘాటంగా సాగింది అటు అంతర్జాతీయ వ్యాపారరంగంలో అమెరికా నక్కుతగ్గడం, యిటు రిజర్వుబ్యాంకు వడ్డీ రేటు పెంచి పరపతిని పరిమితం చేయడం స్పెక్యులేటర్లకు కొంత చిక్కు తెచ్చిపెట్టింది

1951 నవంబరులో రిజర్వుబ్యాంకువడ్డీరేటును 3% నుంచి 3½ %కు పెంచింది అనవసరంగా విరివిగా దేశంలో డబ్బు లభించకుండా చేయడమే యిందలి ఉద్దేశ్యం అవసరమైన వ్యాపారానికి మాత్రమే అప్పులిస్తు స్పెక్యులేషన్‌కి ఋణాలివ్వవలసించవని గూడా రిజర్వుబ్యాంకు షెడ్యూల్డుబ్యాంకులను ఆదేశించింది షెడ్యూల్డుబ్యాంకులవద్దనున్న గవర్నమెంటు సెక్యూరిటీలను, యిదివరకులా కొనటం జరగదని గూడా రిజర్వుబ్యాంకు స్పష్టం చేసింది ఇక రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, సరకుల హామీపైనైనా, వ్యాపారస్థులకు అప్పులు పెట్టడం షెడ్యూల్డు బ్యాంకులకు కష్టమైపోయింది రిజర్వు బ్యాంకు రేటుతోపాటు బ్యాంకులు గూడా వడ్డీ రేట్లు పెంచాయి దీనికి తోడు, అమెరికా అప్పుగా యిచ్చిన 20 లక్షలగోధుమను అమ్మడంతో, మార్కెట్లో చలామణినుంచి సుమారు 70 కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానా చేరాయి ఈవిధంగా దేశంలో డబ్బుకు కటకట అయింది అటు అంతర్జాతీయ వ్యాపారంలో మాంద్యం మేర్పడడంచేత మన ఎగుమతి వ్యాపారం స్తంభించిపోయింది ఇంతవరకు మన మొనాపాలీ అనుకొన్న ముడిసరకులలో గూడా విదేశీపోటీ తలయెత్తింది కృత్రిమపునారతో వస్తువులు తయారవడము, నారసంచులకు బదులు కాగితపుసంచులు వాడుతుండడంవల్ల నారవస్తువులకు గిరాకీ తగ్గింది నారవస్తువుల ఎగుమతిపై ప్రభుత్వం పన్ను తీసివేసినా యీ వ్యాపారం పుంజుకోలేదు నారవస్తువులకు గిరాకీ తగ్గుటచేత, ముడినారకు ధర పడిపోయింది పాకిస్థాన్‌లో నిరుడు మణుగు రూ 105లు అమ్మిననార యివాళ 43 రూపాయలకు యిస్తామన్నా కొనే దిక్కులేక మురిగిపోతున్నది

చైనా అర్జంటీనా సౌత్‌ఆఫ్రికాల పోటీవల్ల, నూనెల ఎగుమతులపై అమెరికా నిర్బంధాలను తొలగించడంవల్ల, నూనెగింజల వ్యాపారం దెబ్బతిన్నది అమెరికా ఈజిప్టు టర్కీ మెక్సికో మొదలైన దేశాలలో ప్రత్తి విస్తారంగా పండించడమూ, ప్రత్తిధర పడిపోయి బట్ట ఎగుమతివ్యాపారం సన్నగిల్లింది ప్రత్తి విషయంలో మరో విచిత్రమేమంటే, ఒకవైపు పాకిస్థాన్ నుంచి ప్రత్తి వచ్చే అవకాశం కన్పించనందున ఎక్కువధరకు అమెరికా ప్రత్తికోసం మన మిల్లులు ఆర్డరిచ్చాయి నిగుడు అడిగినదాంట్లో ఏడవవంతు మాత్రమే దిగుమతి అవడంచేత యీ యేడు కావలసినదానికన్నా 6 రెట్లు ఆర్డరిచ్చాయి ఆర్డరిచ్చినంత దిగుమతి అయింది ఫలితం ఏ రేవులో చూచినా ప్రత్తి మురిగిపోతున్నది ఎగుమతి వ్యాపారానికిలా దెబ్బ తగలడంతో యీ సరకుల స్పెక్యులేషన్‌కు అలవాటుపడి అనాయాసంగా కోట్లకొద్దీ లాభం కొట్టవచ్చునని ఆశకొద్ది, అధికధరకే కొని నిల్వచేసి ఉంచినవారి స్థితి యిరుకున పడింది కొత్తబడ్జెట్‌లో ఎగుమతి పన్నుల భారమేమైనా తగ్గుతుందేమోనని ఆశించారు కాని ఆ ఆశ నిరాశ అయింది ఒకవైపు వ్యాపారం పడిపోవడం, మరోవైపు అప్పులు చెల్లించమని, లేదా యింకా ఎక్కువ సరుకు హామీగా ఉంచమని బ్యాంకులు చేస్తున్న ఒత్తిడిచేయడం, కొత్తబడ్జెట్ ఆశ నిరాశ చేయడం వీటన్నింటికీ తట్టుకోలేక, తమవద్ద నిల్వ ఉన్న యావత్తు సరకును ఒక్కసారి అమ్మకానికి ఎగవేసి తెగనమ్మజూచారు కాని కొనేదిక్కులేక ధరలు తీవ్రవేగంతో పడిపోసాగాయి ఈ దుస్థితి ముఖ్యంగా నూనెగింజల వ్యాపారానికి సోకి, వెండి బంగారాలువంటి వివిధవ్యాపారరంగాలకు ప్రాకింది వెండి బంగారాల ధరలు తగ్గడానికి కారణం, అందులోను స్పెక్యులేషన్ విపరీతంగా ఉండడం, యీ దేశంలో ధర హెచ్చుగా ఉన్నందున విదేశాలనుండి దొంగతనంగా చాలా బంగారం (1951 సం॥లో 630 ఔన్సులు దిగుమతి యైందట) దిగుమతి అవడం బంగారంతోపాటు వెండిధర తగ్గింది ఈ రెండింటి ధరలు పడిపోవడంతో, స్టాకులు షేర్లు పడిపోయాయి దేశమంతటా పెద్ద కలవరం బయలుదేరింది సహజకారణాలవల్ల కొన్నింటికి ధరలు పడిపోతే, కలవరంవల్ల మిగతావాటి ధరలు పడ్డాయి స్పెక్యులేషన్‌లో పుట్టిన కలవరం

# దేశోద్ధారక వర్ధంతి



ఈ ఏప్రియల్ 6 వ తేదీఖు (చైత్రశుద్ధ ద్వాదశి ఆదివారం) విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి వర్ధంతి ఆంధ్రదేశమంతటా జరుపబడింది కళాప్రపూర్ణుని సాహిత్యోపాసనకు ప్రత్యక్ష ఫలితము 'భారతి" ఆ తండ్రి దీవనలు నిత్యము భారతిని వృద్ధిపొందించుగాక!

సర్వత్రా వ్యాపించింది ప్రతిచోటా కొనుగోలు లేక ఎక్కడి సరకక్కడ స్తంభించిపోయింది కొనుగోలు లేనందున ఆహారధాన్యాల ధరలు, గూడా బాగా పడిపోయాయి

ఈ విధంగా విదేశీవ్యాపారమాంద్యం, మితిమీరిన స్పెక్యులేషన్, బ్యాంకువడ్డీరేటు పెరిగి పరపతి బిగిసిపోవడం అరిపోతున్నామనే కలవరం- వీటన్నింటి సమష్టిప్రభావమే ధరల తగ్గుదలకు కారణం దీనికిది కారణమని విడదీసి చెప్పడం కష్టం

ధరలు తగ్గిపోతుండటం చూచి కొందరు ఆర్థికమాంద్యం వస్తుందని జోస్యం చెప్పారు

1951 సంవత్సరం ప్రథమార్థం నాటికీ, యిప్పటికీ పోల్చిచూస్తే ధరలు బాగా తగ్గినమాట వాస్తవమే గాని, అతి పెనువేది కొరియాయుద్ధాత్పూర్వపు స్థాయికి రాలేదన్న సంగతి గమనించాలి స్పెక్యులేషన్ వ్యాపారులు విపరీతంగా పెంచిన ధరలు మాత్రం పడిపోయాయన్నమాట అదైనా హోల్‌సేల్ స్థాయి సరకులకే గాని, చిల్లర వర్తకం సరకులకు తగ్గలేదు ఈ ఒడుదుడుకులలో యేవో కొద్దిమంది వ్యాపారులు నష్టపడటం జరిగింది కాని జనసామాన్యానికి లాభించింది అట్టే లేదు

అంతర్జాతీయ పరిస్థితుల్లో మళ్లీ మార్పువచ్చినా అమెరికా తిరిగి సమరసామగ్రికొనడం ప్రారంభించినా, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల సన్నాహాలు తీవ్రతరమైనా మళ్ళీ స్పెక్యులేషన్ తలెత్తటం, ధరలు పెరగడం తథ్యం ఇప్పుడు లభించిన యీ అవకాశాన్ని వినియోగించుకొని, కొరియా యుద్ధాత్పూర్వపు స్థాయిలో ధరలను స్థిరీకరించడానికి ప్రభుత్వం గట్టిగా ప్రయత్నించాలి

ఆహారం విషయంలో లోటు భర్తీచేసుకోవడానికి గాని పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రి దిగుమతి చేసుకోవడానికిగాని, అనేకకోట్ల విదేశీ ద్రవ్యం అవసరం ఇందుకు ఎగుమతి వ్యాపారం సౌష్ఠవంగా ఉండి యితర దేశాలతో పోటీకి నిలవగలగాలి ఇప్పటికే, మనం తప్ప యింకెవరూ ఉత్పత్తి చేయలేరనుకొన్న ముడిసరకులకు ప్రత్యామ్నాయంగా కృత్రిమపు ముడిసరకులు తయారుచేస్తున్నారు జనుమును నీలిమందు వ్యాపారం యిలాగే పాడైంది వస్త్రాలవ్యాపారంలో గూడా జపాను పోటీ తీవ్రం కావటం తథ్యం

విదేశాలలో మన సరకులు అమ్ముడుపోకపోవడానికి ప్రభుత్వం ఎగుమతిపన్నులు విధించడం, సకాలంలో ఆయా దేశాలకు ధారాళంగా కోటాలు నిర్ణయించకపోవడంగు అని వ్యాపారస్థులు అంటున్నారు ఇందులో కొంత సత్యం ఉండటంచేతనే, యీమధ్య ప్రభుత్వం వేరుశనగపై ఎగుమతిపన్ను రద్దుచేసింది ఉన్నిపై పన్ను బాగా తగ్గించింది ఎగుమతి వ్యాపారాన్ని పోషించుకోడానికి, అవసరమైతే, మిగతా ముడిసరకులపై గూడా ఎగుమతిపన్ను రద్దు చేయనిచో పారిశ్రామికంగా బాగా అభివృద్ధిలోకి వచ్చేంతవరకూ ముడిసరకులను మనం ఉపయోగించుకోలేక యితరదేశాల కొనుగోలుపై ఆధారపడి ఉండాల్సిందే గదా

వ్యాపారరంగంలో వస్తువుల సప్లై—వాటి గిరాకీనిబట్టి ధరలు నిర్ణయం గాకుండా మార్కెట్టులో యేవస్తుసరకూ ఒక్కసారిగా కొని ధరలు పెంచడం, ఒక్కసారిగా విడుదలచేసి ధరలు తగ్గించడం, యీ రకం స్పెక్యులేషన్— ప్రజలకు, మామూలు వర్తకులకు గూడా నష్టదాయకం కాబట్టి దేశీయవ్యాపారంలో గాని, విదేశీవ్యాపారంలో గాని యీ స్పెక్యులేషన్‌ను నిషేధించడం మంచిది

దేశంలో డిఫ్లేషనరీపరిస్థితులు పారిశ్రామికాభివృద్ధికి దోహదం కావు నిరుద్యోగం ప్రబలుతుంది వ్యాపారం మందగిస్తుంది కనుక స్పెక్యులేషన్ నిమిత్తం గాక, యథార్థ వ్యాపారావసరాలున్నవారికి సులభంగా పరపతి పుట్టేట్లు చేయాలి ప్రధాని నెహ్రూ అన్నట్లు ఈ ధరల మాంద్యం ఉత్పత్తిపై దెబ్బదీయకుండా చూడాలి ఉత్పత్తి దెబ్బతింటే నిరుద్యోగం ప్రబలుతుంది సరసమైన ధరలకు సమాజంలో ఉన్నవారందరికీ సమానంగా వస్తువులు లభించేటట్లు చేయగలగాలంటే సరిపోయినంతగా ఉత్పత్తిచేయడం అవసరం ఇందుకు ధరలలో తీవ్రమైన ఒడుదుడుకులు లేకుండా, ఒక స్థాయిలో నిలకడగా ఉండటం ఎంతైనా అవసరం

---

# ప్రపంచ కథా బహూకృతి- ★ శ్రీ పాలగుమ్మి పద్మరాజు

ప్రపంచ కథానికలపోటీలో పాలగుమ్మి పద్మరాజుగారికి ద్వితీయ బహుమానం వచ్చిందని గత మార్చి 16 వ తేదీ ఆంధ్రపత్రికలో ప్రకటించిన వార్త ఆంధ్రజాతి కంతటికీ మహదానందం కలిగించింది. టాగూరు మహాకవి నోబెల్ బహుమానం అందుకున్న తరవాత మనదేశంలో సాహిత్యంలో ఎవరికీ ఇంతటి బహూకృతి, గౌరవము లభించలేదు. బహుముఖాలుగా నిరుత్సాహంగా ఉన్న వర్తమానాంధ్రదేశ చరిత్రలో ఈ బహూకృతి ఆంధ్రులందరు గర్వించదగిన విషయం.

అసలీ ప్రపంచ కథానికలపోటీ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక తలపెట్టి నిర్వహించింది. భారతదేశం తరఫున హిందుస్థాన్ టైమ్సు సంపాదకులీ పోటీ జరిపారు. ఆంధ్రదేశం తరఫున ఆంధ్రపత్రికా సంపాదకులీ పోటీ నిర్వహించిన విషయం తెలుగువారందరికీ తెలిసినదే. ఆంధ్రపత్రికా సంపాదకులేర్పరిచిన నిర్ణేతలు తెలుగు కథల్లో నాలుగు ఉత్తమమైనవని నిర్ణయించి ఈ నాలుగూ మొదట భారతకథలపోటీకి పంపించారు. మొట్టమొదట ఈ కథకులకు నలుగురికీ ఆంధ్రపత్రికా సంపాదకులు నూరేసి రూపాయల బహుమతులేర్పరచారు. పద్మరాజుగారి గాలివాన మొదట ఈ గౌరవం అందుకున్నది. ఇలాగ భారతదేశంలో అన్ని రాష్ట్రాల వారూ అఖిలభారత కథలపోటీకి నాలుగేసి కథలు పంపించారు.

హిందూస్థాన్ టైమ్సు సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు భారతదేశ కథలన్నిటిలోను రెండు కథలు ఉత్తమోత్తమమైనవని నిర్ణయించి ఈ రెండు ప్రపంచ కథానికల పోటీకి పంపించారు. అఖిలభారత నిర్ణేతలీ రెండింటిలోను 'కళ్లు' అనే కథకు మొదటి బహుమతీ ఇచ్చారు. పద్మరాజుగారి గాలివానకు రెండవ బహుమతీ వచ్చింది. రెండవసారిగా పద్మరాజుగారి కథకు మళ్ళీ వెయ్యి రూపాయల బహుమానం వచ్చింది.

న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ జరిపిన ఈ పోటీలో 23 దేశాలు పాల్గొన్నాయి. ఆయా దేశాలలోని ప్రధాన ప్రచురణసంస్థలీ పోటీ నిర్వహించాయి. మొత్తం దీనికి 59 కథలు వచ్చాయి. ఈ పోటీలో పాల్గొన్న దేశాల అధిక సంఖ్యాక నిర్ణయం ప్రకారం ప్రథమ బహుమతీ నిర్ణయించాలనీ, ఆ నిర్ణయాన్ని అనుసరించి మొదటి బహుమానం 5 వేల డాలర్లు ఇవ్వాలనీ హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఈ పోటీ ఏర్పరిచినది అమెరికా దేశమే కనక అమెరికా కథకులెవరూ దీనిలో పాల్గొనకూడదని హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఇదీగాక ఏ దేశము తన కథకు వోటు వేసుకోకూడదని కూడా ఒక నిర్ణయం జరిగింది.

అయితే 1951 సంవత్సరాంతంలో జరిగిన ఈ పోటీనిబట్టి ఏ ఒక్క కథకు ఉత్తమబహుమతి రాలేదు. అందుచేత రెండేసి ఓట్లు వచ్చిన నాలుగు కథలకు ఈ బహుమతీ సమానంగా పంచారు. 'ఎందుకు' అన్న కథకు ఐర్లండ్ జర్మనీలు ఓట్లు వేశాయి. ఇండోచైనా హాలెండులు 'అయిదవ రోగం' అనే కథకు ఓట్లు వేశాయి. 'ప్రేమ నా చిన్ననాటి కలలు చీల్చివేస్తుంది' అనే కథకు స్వీడన్ డెన్మార్కుల ఓట్లు వచ్చాయి. ఇజ్రాయెల్, గ్రీసులు 'నిద్రపోయే సంచీ' అనే కథకు ఓట్లు వేశాయి. ఇందుచేత ఈ కథలు నాలుగింటికీ 1050 డాలర్ల బహుమతీలు సమానంగా పంచారు. మిగిలినవి 14 కథలు. ఈ కథలన్నింటికీ ఒక్కొక్క ఓటు వచ్చింది. పాలగుమ్మి పద్మరాజుగారి కథకు ఆస్ట్రియా ఓటు చేసింది. ఈ పైన ఈ 14 కథలలోను మళ్ళీ ఉత్తమ కథ ఏదో నిర్ణయించవలసిందని మరి ఇద్దరు నిర్ణేతలను ఏర్పాటు చేశారు. మిగిలిన కథలన్నింటిలోను పాలగుమ్మివారి 'గాలివాన' సర్వోత్తమంగా ఉన్నదని నిర్ణయించారు. అందుచేత మొత్తం 5 వేల డాలర్ల బహుమతిలోను మిగిలిన 8 వందల డాలర్లు పద్మరాజుగారికి బహూకరించడానికి నిర్ణయించారు.

ఈ నిర్ణయాన్ని గురించి పోటీనిర్వాహకులు ఒక ప్రకటన చేస్తూ 'గాలివాన' నిజంగా తీ(

పరీక్షలో నిలబడి 14 దేశాల కథలలో ఉత్తమోత్తమ కథగా నిర్ణయింపబడినదనీ, పై నాలుగు కథలకు రెండేసి ఓట్లు రావడంవల్ల పద్మరాజుగారి కథకు ప్రథమ బహుమతి పంచడానికి వీలులేకపోయిందనీ కేవలం ప్రజాస్వామ్యసూత్రాలనుబట్టి మాత్రమే ఇలాగ నిర్ణయించవలసివచ్చిందనీ అన్నారు ఈ విధంగా పద్మరాజు 'గాలివాన' జాతీయాంతర్జాతీయాలైన గాలివానలెన్నో గడిచి ప్రపంచ కథాభిమానుల హృదయాలు చూరగొన్నది

## పాలగుమ్మి పద్మరాజుగారు

పాలగుమ్మి పద్మరాజు గారు ఆంధ్రపాఠకులకు చిరపరిచితులే వీరి వయస్సు 36 సంవత్సరాలు ఇప్పుడు వీరు భీమవరం కాలేజీలో కెమిస్ట్రీ లెక్చరరుగా పనిచేస్తున్నారు బెనారస్‌లో ఎమ్. ఎస్‌సి. చదివారు అటుతరువాత కొంతకాలం పిఠాపురం రాజా కళాశాలలో పనిచేశారు

చాలాకాలంనించి వీరు కథలేగాక కవిత, నాటికలు, నవలలు, విమర్శలు విలువైనవెన్నో రచిస్తున్నారు వీరి ఖండకావ్యాలు కొన్ని సుప్రసిద్ధ సారస్వత పత్రికలు ప్రకటించాయి పురిటిపాట, రాలి విమానం చీకటి వెంపలైనవి వీరికవితా రచనల్లో ముఖ్యమైనవి దక్కని నిహాయితీ, విస్పష్టత, వీరి కవితలో ప్రత్యేక గుణాలు వీరి కవితా రచన చాలా స్వతంత్రమైన పంథాలో నడిచిపోతుంది అగ్నాతిన కవితామార్గంలో వీరిది ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న కవిత చాలాకాలం క్రిందటే వీరు అరవిందుని '*Love and Death*' అనే కావ్యం కూడా అనువదించారు

ఇంతకుపూర్వం వీరు ఆంధ్ర వారపత్రికలో టర్జినీవ్ వ్రాసిన ఫాదర్స్ అండ్ సన్స్ అనే నవల తెలుగులోకి అనువదించారు ఇలాగే ఇంకా ఒకటి రెండు చిన్న నవలలు కూడా వీరు భాషాంతరీకరించారు ఇంతకుపూర్వం వీరురచించిన కథలన్నీ 'కూలిజనం' అనే పేరుతో ఇంతకుపూర్వమే వెలువడ్డాయి

ఒకసారి ఆలిండియారేడియోవారు జరిపిన రేడియో నాటికల పోటీలో కూడా వీరికి బహుమతి వచ్చింది ఈయన రచించిన నాటికలొకటి రెండు ప్రదర్శించారని కూడా తెలుస్తున్నది

ఇలాగ వీరి రచన ఎక్కువగా బహుముఖాలుగా సాగినా నవలా, కథారచనలో వీరికి ఎక్కువ అభినివేశం ఉన్నట్టు కనబడుతుంది పద్మరాజుగారు రచనలో ఎక్కువగా వాస్తవిక పద్ధతి అవలంబిస్తారు వీరి రాజకీయదృక్పథం మానవతావాదం (*Haman-ism*) వైపు బాగా మొగ్గుతుంది

## గాలివాన

దేశీయ విదేశీయ విమర్శకుల మన్ననలందుకున్న వీరి కథను గూర్చి వేరే ప్రత్యేకంగా వ్రాయవలసిన పనిలేదు ఈ కథ పూర్వం ఆంధ్రపత్రికలోనే గాక ఇటీవల ఏప్రిల్ 19 వ తేదీ ఆంధ్ర వారపత్రికలో కూడా పడింది అందుచేత తెలుగు పాఠకులందరికీ ఈ కథ సుపరిచితమైనదే

ఈ కథలో రావు మనస్తత్వము ముఖ్యమైనదే మనిషి మనస్తత్వము పాఠకులకు చాల సునిశితంగా ధ్వనిస్తాయి రావు ఒక యాంత్రికబద్ధంగా నడిచిపోయే వ్యక్తి గాలివానలో ఇతని సూత్రాలన్నీ పటాపంచలైపోతాయి ఇంటప్పుడు ఇతనిలో మానవత్వం స్ఫుటంగా వికసిస్తుంది కథ ముగిసేసరికి రావుతోబాటు పాఠకులకు కూడా ముట్టుకుంటూ ఏకుణ్ణి కాదు క్షమించే మనిషినిగాదే ఎక్కువగా సానుభూతికలుగుతుంది గాలివానతోపాటే మానవుల మనస్సులలో కట్టుకున్న బాహిరాలూ తొలగిపోయేవిధంగా కథ ప్రారంభంనుంచీ మనకువ్యంగ్యంగాస్ఫురిస్తూనే ఉంటుంది ఈ కథలో శిల్పము, సంఘటన, ప్రధానభావము ఒకేమూసలో కరిగిపోసినట్లు దక్కని సమన్వయంతో నడిచిపోతూంటాయి

నేటి తెలుగువాఙ్మయం ఏశాఖలోను ఇతర భారత వాఙ్మయాలకు తీసిపోదనీ, కొన్నింటిలో ఇదే అగ్రస్థానం వహించగలదనీ బహు భాషావేత్తలైనకొందరు విమర్శకులంటున్నారు పద్మరాజు గారి కథ భారత భాషల్లోనే గాక ప్రపంచభాషల్లో కూడా తెలుగుభాషకు గౌరవం సంపాదించింది

దరిదరిగా అర్ధశతాబ్దంనించి తెలుగులో వెలువడిన ఉత్తమకథలు కొన్ని ఆంగ్లభాషలోకీ భారతీయ భాషల్లోకీ అనువదించడంవల్లనే నేటి తెలుగు కథాస్వరూపం విదేశీయులకు స్పష్టంగా అవగాహనకాగల అవకాశాలున్నాయి ఈ బహుమతి ఇటువంటి ప్రయత్నానికి బాగా ప్రోత్సాహం కలిగించగలదని ఆశిస్తున్నాను

పద్మరాజుగారింకా యువకులే క్రమంగా వీరు ఆంధ్రులకు నోబెల్ బహుమాన గౌరవంకూడా సంపాదించగలరని ఆశిస్తున్నాను

'శాస్త్రి'

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము !!!

(ముగ్గురు ఋషి శిష్యులు ప్రవేశింతురు)

మొదటి

"బ్రహ్మఋషి యైన కౌశిక క్రతువు వేడ
పూర్తియైనది కామ్యసంపూర్తి యగుచు,
తత్ఫలంబు నిర్భయత్వంబుతోడ
మనుచుచుంటిమి సత్తపోవనమునందు"

గాలవ మిత్రమా! శాంకాయనా! ఈ యజ్ఞ ఫలము శుభప్రదమైనదై నది నీ వన్నట్టిక నిర్భయముగా మనము తిరుగ గలము

శాలం గాలవా! ఈ తపోవనమున మారీచుడు మున్నగు రాక్షసులు విశ్వామిత్రాదులను దిక్కు మన వంటివారి జోలికి రాకపోయినను మాకు మిక్కిలి భియముగా నుండెడిది

మూషిక విశ్వామిత్రాదులనే కాని యజ్ఞములను వారేల పీడింపరైరి?

గాలవ శౌమ్యాయనా! విశ్వామిత్రుడు పూర్వము క్షత్రియుడు తపముచే బ్రాహ్మణత్వము నందెను అప్పటినుండియు వారికు చేయు తపమును వారు సహింప జాలరైరి

శౌమ్య ఐనను, రాక్షసులు తపోవిఘ్నము కలిగింప గారణమేమో?

గాల రాక్షసరాజైన రావణుడు విశ్వామిత్రుని తపోభంగమునకు వారిని నియమించి యుండెను

శౌమ్య రావణునకు విశ్వామిత్రునిపై గోప మేల?

గాల విశ్వామిత్రుడు బ్రహ్మతేజమున ప్రకాశించుచున్నా డని

శౌమ్య ఐన?

గాల ఏనాటికిని విశ్వామిత్రునకు గోపము రప్పించినచో తమ ప్రభావ మడ సాతిని బ్రహ్మర్షిత్వము పోల్లు వోగలదని

శమ్య ఆయన శాపముచే నీ రాక్షసుల నివారింప లేడేమి?

గాల కోపించిన గాని శాపము రాదుకదా!

శౌమ్య ఎందరో ఋషులు శపించినవారు గలరు వారి బ్రహ్మర్షిత్వమునకు లోపము రాలేదే?

గాల పరంపరాప్రాప్త బ్రహ్మర్షిత్వమున కపుడపు డిచ్చిన శాపముల వలన లోపము కలుగదు ఇతని దచిరప్రాప్త బ్రహ్మర్షిత్వము కావున లోపము కలుగవచ్చును అందుచే విశ్వామిత్రుడు రాముని గొని వచ్చినాడు

శౌమ్య ఏమో! ఇంతటివాడే క్షత్రియ కుమారుని సాయ మపేక్షించినాడన నాతని తపో మహత్త్వమునకు లోపము కాదా?

శాలం కాదు కాదు వినుము!

"యజ్ఞసంరక్షణంబున కొకనిమిషము
రామచంద్రుని గొనితెచ్చి ప్రేమతోడ
దివ్యమగునస్త్రముల మంత్రదీపితముగ
నతని కుపదేశమిచ్చి కామ్యంబుగాంచె"

ఇక, రాముడో
"హరిగిమవాన, బాలరవి
యందపుమోమున, వాణియాను-
క్సరణిని, వార్ధికిడుగు బ్ర
కస్తగభీరత మవ్మగుంను సుం
దరత, నలంఘ్యతన్దుహీన
ధాత్రిధరంబు, మహాపరాక్రమ
స్ఫురణ నతిండు దేవపతి
పూర్ణపరాక్రమ గర్వశతయా."

"ఇతఁడు వచ్చినదాదిగా నీతపోవ
నమునొవగ్గ్యు సుతపోధనమ్ముగాఁగ,
కాంచగంటిమి కన్నులుగలఫలంబు
నితని ప్రాగ్జన్మకృతినిగాంచి యుంపువిూఁ"

గాల రాము మహోగ్రపరాక్రమ బలశాలి యేలన, రాక్షసులు మాయారూపధరులై రాగా వారి కొంటరిగా నిలిచి యజ్ఞమును రక్షించినాఁడు రాక్షసులతని జూచినంతనే పాఱిపోవుటచే వారికు వారి నందఱినో జంపవలసిన పనియే లేకపోయెను మఱియు మారీచ సుబాహులు రావణాసురుని యను చరులలో మహాబలశాలులు వారు నిత్యము విశ్వామిత్రుని తృణసమానునిగా జూచెడివారు ఒక్క యస్త్రమున వారినిద్దఱి వారిని కొట్టగా నది వారిని త్రిప్పి త్రిప్పి సముద్రమున పంచివేసెనట

శామ్య ఈతడు తాటకి యను రక్కసిని జంపుట నిజమా?

గాల నిజమే

"సదయుండై సుమసన్నిభాస్త్రమున ర
క్షస్త్రీని ఖేదేయఁగా
నదిస్వేదంబును గ్రక్కుకొంచు బరమా
యాసంబునన్ రాగ ద
న్మదమున్ద్రుంపఁగ రాము, డామె కిరఖి
న్నంబైన దేహంబుతో
విదితాక్రింతసియాశ రాక్షసులమున్
జెనఖితి వాటిల్లఁగన్

ఇట్లు
"మృదులమును గతినంబుగా మదిచెలంగు
మత్తుమును రామచంద్రుఁడో మానాచేయు,
చిత్రచరితులు తలప విశిష్టులైన
మానవోత్తము లతిగూఢమతులు వ్రతులు"

శాలం కేవలము దయచేతను శౌర్యముచేతనే కాదు రామలక్ష్మణులు పూజనీయులగుట ఋషిగణ విశిష్టమైన వారి ప్రీతిత్వము ప్రశంసనీయము

శామ్య రాజపుత్త్రుల నందఱను స్తుతించు వారే వారి తప్పులను చక్కని కమ్మని భోజనము, దాసులసేవ, తలిదండ్రుల లాలనము, వైద్యుల యుప చారములు, ప్రేమతో గొట్టక తిట్టక విద్య నేర్పు గురు వులు, ఇంక వారికి జబ్బు వచ్చుటలో వింత యేమి? నేను రోగము వచ్చినను మానక గురుసేవ నిత్యము చేయుదును. భిక్షకై పోవుచు నేయుందును దానం బట వది కొంత లభించిన నంతలోనే జీవయాత్ర గడ పుదును గురువులు నన్ను గతినముగా శిక్షింతురు కేలవిూద నే పదిక చదువుటకే యవకాశము లేని నిత్య కృత్యములు ఇట్టి నా దల్పవిద్య, అట్టివాని దధిక విద్య నా విద్య కొఱకున స్తుతింపరు రాజపుత్త్రుల నందఱు స్తుతించువారే

గాల ఓరీ! మూర్ఖా! గురువుల నాక్షేపింప రాదు

శామ్య నిజమైనమాట చెప్పితినే కాని యాక్షేపింప లేదు

గాలం యథనింపాకరమైన వాక్యము సత్య మైనను బలుకరాదు వినరాదు గురువు లవాలోచిత ముగా నే పనియు చేయరు

శామ్య గురువులు స్వలాభ మపేక్షింతురే కాని గుణ మపేక్షింపరు

గాలం ఓరీ! మూర్ఖా! నీ మాటలు నాస్తిక ములు నే నిక వినజాలను.

శామ్య సత్యవచనములు నాస్తికవచనములని నిరాకరింతువా?

గాలం అజ్ఞానచేతస్కులు హేతువు మాని నను నూరకుండిరు (మాచి) ఆహా! రామలక్ష్మణులు తిన్నమసరింప విశ్వామిత్రుఁ లిటకే విచ్చేయు చున్నారు

గాల (మాచి) ఔను విశ్వామిత్ర భగవా నుఁడే

"రాజపుత్త్రులతోఁగూడి పూజనీయ
బ్రహ్మమయులు విశ్వామిత్రపరమఋషులు
వచ్చుచున్నారు వేదరిపుప్రభావ
శమిత నానాత్రిభవించిన శరణితోఁడ"

(నిష్క్రమింతురు)

ఇది సిద్ధ విష్కంభము

## పంచమాంకము

[అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

విశ్వా వత్సలారా! రామలక్ష్మణులారా! విద్యాస్త్రములు మీరు శాకడ గ్రహించి యజ్ఞమున

స్వాతి తెలువారు సూర్యుడు ఘ
  నప్రతిరోధము బాపినంతి స్వ
చ్ఛత వికసత్సరోజముల సంగతి
  నొప్పు సరోవరంబు నీ
గతిని నిరోధ మీగిన ప్ర
  కాశలుగాగ సమస్తవస్తువుల్ "

రాము ఇంసలి స్వచ్ఛసరోవరజలముల దోచు సూర్యబింబములవలె మానవమానసముదీతి హింసాహీనములై పక్షులు శాంతిసుఖమందును

లక్ష్మి
"సరసులోని యగాధంపు జలములోన
నెసగు నుత్తమమానసౌకసము లొప్పు
సకలరసపూర్తి కలిచిత్తసద్మమంగు
బరగు మజ్జ్వల సూక్ష్మభావముల భంగి "

రాము
"కేకిరమణులు స్వాగతగీతి పాడి
మేఘరాజికి సంతోషమేదురలను
నృత్యములు సల్పుచున్న, వీ నీరదాళి
ద్రోలి రవి వెల్గ నేకిపచ్చి రాలె "

విశ్వా వత్సలారా! ఈ శరత్కాలశోభ యింకను జూడుడు

"ప్రబలశత్రుఘనాంధకారమున నునిగి
యెవరి చంచలదీప్తితో వెలిగియున్న
నిర్మలంబుగ నొప్పు నీవింగి యిపుడు
కాశతృణప్రసవంబున గంతుమిగిలి "

మఱియు
"మేఘపటలి ద్రుంచి మిన్ను చెల్వొందగా
బరవ్రపకుల గెల్చి వజల రాజు
ప్రజల జెలువుమీర బరమోద్ధతి గా
బద్మవితతి నయనపర్వ మగును "

ఇట్లు మన కీతపోవనమున శరత్సమయము సాక్షాత్కారమైనది అది నిత్యనూతనమై యున్నది తపోవనాంతికమున వన్యఘోష వినవచ్చుచున్నది నగరవ్యవహారము లిట కతిదూరములైనవి ఈ యరణ్యమున మృగసమానవృత్తితో గ్రామ్యజను లాత్మధర్మముల నెఱుంగనివారైనను సద్ధర్మమాత్ర మాచరింపరు. పరస్పరవైరములు స్వైరవిహారములు వీ రెఱుంగరు గ్రామీణస్త్రీలు నిత్యమాతృత్వపరలు అపకారము సైతము వీ రతిశీఘ్రముగా మఱతురు మిమ్ము వా రభి నందింపగలరు చూతురుగాని

రాము వీరి కంటబడక మనము తప్పించుకొన లేముకదా!

లక్ష్మి ఈవనశోభ మఱగి యీజేవాయుచిత్తము కూడ దూరభావ నందపన్నది ఇపుడు నిసర్గము, ఆర్షవామికృతము నగు తపస్విచరితము భగవాను లన్నట్లు ప్రత్యక్షముగా జూడగందుము

(అందఱు నడతురు)

లక్ష్మి (చూచి) ఆర్యా! చూడుడు
"సస్యభారనతం బయి స్వర్ణకాంతి
నొప్పుకలమపుఁ జేన్నులు గడలుకొన్న
క్షేత్రభూమిని గన్గొన్న మాత్రమునను
బొందుచుంటి నపరిమితానంద మిపుడు

విశ్వా ఆ మూల గూర్చుండియున్న కృషీవలుల గంటిరా? క్షేత్రములు చక్కగా దున్ని చదునుచేసి యాకుమళ్లు పెంచి దగ్గచేసి వర్షము కురియగా నాట్లు పిదప గలుపు తీసి రేయింబవళ్లు కనిపెట్టకొని యుండి శ్రమఫలము లగు సస్యముల గోసికొని క్షేత్రోపజీవు లింద్రభోగ మనుభవింతురు వారి కెవ్వరీడు రారు కష్టఫలము నిగను ఘనులు, సామ్యాభ్యసులు విజముగా వారే ఈరీతి బండిన సస్యములో

"దైవతపైతృకక్రియలు
  ధార్మికబంధుజనాళితృప్తి సౌ
ఖ్యావహ మాటభో ముల
  నంచితరీతిని వారి కుంచియున్
గోవుల మేపువారలకు గొంత
  త్యజించియు, చిలంబుగా
బవసథంగి సాత్మజుల
  భార్యల గూడి భుజింత్రు శేషమున "

లక్ష్మి ఈ కృషీవలుల చరిత్ర మతిశ్లాఘ్యము

విశ్వా మఱియు, వారు
"శ్రమ గణింపరు దైవవిశ్వాసమునను
దొరకినది తృప్తిగా దిని దోషభావ
రహితులై యిక్కలి సుఖింత్రు రమ్యభంగి
సర్వజీవితహేతువుల్ సజ్జను లయి.

అంతేకాదు, వారికి

వృద్ధ — ఆఁ మా బిడ్డల తండ్రి కోడెలని దీసికొని వచ్చుటకై గ్రామాంతర మేగి యున్నాడు పుత్రులు క్షేత్ర సస్యములను రక్షించుచున్నారు మనుమలు ఇంటిపనులు చేయుచున్నారు మీరు మా లోగిలికి వచ్చి పవిత్రము చేయుటకు ఈ కుమారు లెవరు? ముద్దువచ్చుచున్నారు

విశ్వా — దశరథ మహారాజ పుత్రులు!

వృద్ధ — వీరి పేళ్లు?

విశ్వా — (చూపి) ఇతడు రాముడు పెద్దవాడు ఇతడు లక్ష్మణుడు

రాము — (చేరి) వృద్ధా! రాముడు నమస్కరించుచున్నాడు (నమస్కరించును)

లక్ష్మ — (చేరి) వృద్ధా! రామానుజుడు నమస్కరించుచున్నాడు (నమస్కరించును)

వృద్ధ — చిరంజీవులు కండు (చూచి) ఏమి? ఇరువురు నమస్సులు ఆచరించినారు?

విశ్వా — క్షత్రియుల నిత్యము తపము గురించి ధర్మరక్షణము చేయుదురు వీరు నా యాగముచే యజ్ఞ విఘ్న కారకులగు రాక్షసుల జంపినారు

వృద్ధ — ఈ గ్రామవనముల మృగములను మాత్రము చంపకుడు

లక్ష్మ — ఇవి మీకు ప్రత్యపకారము కలిగింపవా?

వృద్ధ — ఐనను చంపకుడు చెట్టు వేసిన వనియే పోవును

లక్ష్మ — నీ కపకారము చేయువానిపై గూడ నీ పక్షపాత మేల?

వృద్ధ — ఈ మృగములు సావాసముచే మా మట్టములైనవి అవి యెవరి పసుపులెత్తిన నా కెంతయో బాధ కలుగును

విశ్వా — (రామునితో) వీరి దయార్ద్ర హృదయము గనిపెట్టితివా? అపకారుల యెడనైన వీరు కోపింపరు ఈ గుణ మెంత కొనియాడదగినది?

రాము — ఔను వీరు నిజముగా దేవతా తుల్యులు

విశ్వా — వృద్ధా! పోయిరమ్ము మేము సంధ్య దీర్చి మీ యింటికి వచ్చెదము

వృద్ధ — సరే. (నిష్క్రమించును)

విశ్వా — మీ రెందుల కీ కృషీవలుల జూడగోరితిరి?

లక్ష్మ — అల్పసంపన్నులయ్యు వీరత్యంత తృప్తమనస్కులని

రాము — నేను వ్యవహార జ్ఞానము కొఱకు వీరిని జూచి వీరి తత్వము బోధపడుచున్నచో వ్యవహార నిర్ణయము సుకరమగునని

విశ్వా — బాగుగా చెప్పితిరి

రామలక్ష్మణులు — (విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా — (తనలో) కీర్తి నాతో ద్రిప్పికొనుట వలన రావణ జయహేతువు బలపడును వీరికి వ్యవహార జ్ఞానము తెలియును దశరథునికి పుత్రవిరహమే విమి చేయగును? జనకమహారాజు చేయు సాంవత్సరిక సత్రయాగ మభినందింప నేగవలయును సర్వ మనోహరయగు సీత యీతనికే కదా అతనికడ గల శివధనుస్సును రాముడు కాక యింకెవడు జ్యము చేయగలడు? (ఆలోచించి) రాముడే సీతను పెండ్లాడి తీరును

రాము — (విచారించి) భగవానులేదో యాలోచించుచున్నట్లున్నారే?

విశ్వా — నేను విదేహాధిపుని యాగవిశేషము గూర్చి యాలోచించుచున్నాను

రాము — అక్కడను రాక్షసబాధ లేమైన కలవా?

విశ్వా — నాన్నను నీవు వచ్చినమాత్ర నది శాంతించును జనకుడు సాంవత్సరిక సత్రి మొనరించుచున్నాడు సత్రాంత మభినందింప రమ్మని నన్నాహ్వానించినాడు

లక్ష్మ — మేము కూడ మీతో నచటికి వత్తుము

విశ్వా — మంచిది అపుడు సత్రయాగ శుభాంతము కాగలదు

లక్ష్మ — మరల నయోధ్య కెపుడేగుట?

విశ్వా — ఆ రాజర్షి యజ్ఞఫల మనుభవించిన పిదప

రాము — ఎట్లు?

విశ్వా — ఆట సేగిన తరువాత స్వయముగా ననుభవింతురు లెండు.

అజగన్మోహనాంగి వర్ణోర కుసుమ
పేశల సుగాత్రి నొవరించి విధి తలంప
గాంచి స్త్రీరూపనిర్మాణ కౌశలమున
కచ్చెరువు చెంది గర్వించి యలరె బోలు
   అహా ! చిత్రము !

“ఒక్కసారి కనుంగొనియున్న మాత్ర
మఱచిపోయితి సర్వమ్ము మతి కలంగ
నింక నొకమాఱు కనుగొన్న నేమియాగు
నో ? యెఱుంగను నిజము మనోహరాంగి
   మఱియు
పరమానందముతోడ వత్సలతతో
      బాల్యంబునన్ దల్లి మ
త్పరయై స్తన్యము సంగునాది లాలింగన్
      బ్రాపాదమున్ వీడి, నా
కరయన్ గానపశాల్య మెన్నడును లే,
      దారాత్మసశ్రేణి పెం
పఱజేయన్ జలియింప, నా కిపుడు సం
      ప్రాప్తించె నున్మత్తతల్

యజ్ఞవిఘ్నకారులగు రాక్షసులను శస్త్రాస్త్రముల నాశముచేసితినికాని నాయాత్మశక్తిపై నాకంతయు విశ్వాసము కోలుపోయి యెఱుంగను. ఆమెను గనుగొన్నది మొదలిగి యంతయు ఖాపంచలై పోయినది. ఆహా! కామము శక్తిబలవంతుడుకదా! ఈ కామజ్వరము నా దేహమునంతయు దహింప జేయుచున్నది నాచే నేయకార్యము చేయించునో? ఏలన, ఇది ఋషి యాజ్ఞవలన జేయుకర్మ కాదు. ఇది యకార్యము గురువులకు నివేదింపక చేయునేపనియైనను గొంగపనియేకదా! మఱియు నరణ్యమున యుద్ధమున నెల్లపుడు లక్ష్మణ ద్వితీయుడనయియే కాని యొంటరిగా నుండియుండనుగదా! నా వెనుక లక్ష్మణుడును లేడు. గురువులు లేరు. ఇది న్యాయమా యన్యాయమా యని విచారణ లేదు. అది గ్భూతముతలె మానసమును గాఢముగా కలిపఱచుచున్నది. ఇక రాముడు విషయములకు జలింపనిగాడన్నమాట పొల్లువోయినదికదా! కానిమ్ము, విశ్వామిత్రులకు దూరమున నుండుట మంచిది కాదు. సమీపమున కేగెదను. అవిజ్ఞాత కులాచార స్త్రీ దర్శన ప్రసంగమునుండి మనస్సును మరలించెదను. కాని

“ఈమె జూడక యానందహీనమగును
నా మనస్సది, ఇకపైని నేమియయిన
బరమపావనమైన నా చరిత మెట్లు
వినుత కెక్కుంచె నగుచు నే? నేయు నేల!”

(పరిక్రమించును) ఆహా! అడుగు పడుటలేదు

“ఒక్కయడుగైన నిడజాలకున్నవి పగ
గరము దృఢతరమాయె యీచరణ యుగళి?
ఆమె జూడక యీ కన్ను లౌర? యొుండు
చూడజాలక యున్నవి చోద్యమార!
“ఆమె జూడంగ దలచ్చాని నంతమాత్ర
నవిరళానందమందు నాయంతరంగ
మామె తనువల్లి ముఖబింబ మరయగందు
మరల నానంద వార్నిధి మగ్నమౌదు”

(ఆలోచించి) ఇది కాదు. కొంతసేపాగుగును. సందిగ్ధ ఫలవిషయమున మతిమంతుడు శ్రమపడడు. ఇటనుండు టుచితము కాదు. ఏలన, మహర్షులు బ్రహ్మచర్య నియమములు వారికే కాదు. మనస్సును నిరోధించుటయే సర్వజీవులకు బ్రథమకర్తవ్యము. మఱియు

“బ్రహ్మచర్య వ్రతంబున బరగరాము
డరయజాలడు స్త్రీముఖ మన్నమాట
పొల్లువోరాదు మఱియు నిప్పుడు తలంప
నొంటి నుంటిని స్త్రీ గను టుచితవు కాదు”

(జయించుట నభినయించి) ఇటులేగెదను. (ముందు చూచి) ఓహో! నా నేత్ర పద్మముల నానంద సరసిలో మునకలాడించిన యా సుందరి యీ తరుమూలమున గూర్చుండి యున్నది. ఇట నేయుండి యామె దర్శన సుఖమనుభవించెదను.

(పరిశీలించి) ఇది గాలిచే గదలు మాధవీలత చీ ఇది నన్నింత పరిహసించుచున్న దేల? లేక ఇది కామునో వికలతయా? ఔను కాముకులు వికలచిత్తులే

“ఆత్మవైభవమంతయు నవలద్రోచి
దేహ మతికామతప్తమై తెలుగుగంటి
ధైర్యశాంతులు శద్ధచేతస్కులౌట
నామె రూపంబునెదనుండి యవలద్రోతు”

(ఆలోచించి) అట్లను టుచితము కాదు

“వ్యథితమనమున మోహ మెఱుపించియున్న
నన్ను గనుగొన్నదా యన్నుమిన్న తనదు

మోముదమ్మిని వలపాంచి పూర్ణముగను,
తలపసమ్మోహితైన చేవలుకసైతి "

మురళియ :

"బొమముడిపనవ్వగా బాహుమూలికగాగ
నాయొడంద లక్ష్మిమ్యగా నాతియేసి
ప్రణయ నాదకముగ చేను బరమపూర్ణ
మతిని శాస్త్రుండ నయ్యెద నా యతివ గొనదు "

జనక జరిగినట్లే ముందును జరుగగలదు నేను వృథా విచారక్రమ మందనేలకో పోదును

(తెరలో) "సఖీ! ఇటు, ఇటు "

రాము (విని, చూచి) కాదు నామతి భ్రమ కాదు సత్యము మమానంద నయనానందస్యంది శారద పూర్ణేందుముఖి మూర్ఛితుపై నవనమ్ము వన వదన శోభా పంజికని చే జేయుకొనకేయ సఖులతో నిటే వచ్చుచున్నది

"నవఘనుపై మేఘమును జూచి నాట్యమాడు
నెమలికివలె నీవచ్చు విరుపమాన
సుందరీరత్న వదనారవిందము గని
మన్మనము నాట్యమొనరించు మహితభంగి

(అంత సఖులతో సీత ప్రవేశించును)

ఒకసఖి భర్తృదారికా! ఈ యుద్యానమున నెటగూర్చుండి మనోవినోదమును గావించుకొందుము?

మఱియొకసఖి ఆ మాధవీలత దగ్గఱ అశోక వృక్షపు నీడ

సీత సఖీ! చంద్రకళా! భర్తృదారికా యని ప్రత్యేకగా పిలిచెదవేమి? ఇదివఱకెట్లు సఖీ యను దానవో యట్లే సఖీ యనుము

చంద్ర నిన్నటినుండి నీవట్లగపడుటచేత నె యట్లంటిని

సీత : మధురికా! నీవట్లందువేమి? మీరిరువురే కదా సీతకు ప్రియసఖులు.

మధు నీవు మఱియొకరి దానవువలె గనబడుచున్నావు చపలవు భీతవునాదువేమి? కనులు పైకెత్తు. నీవు రాగముచే నిద్రలేని దానవువలె నున్నావు ఏకాంతమున నీ మనసులో నేమో యనుకొనుచున్నావు.

చంద్ర : ఇప్పుడిక సిగ్గుగా నచ్చినది కూడ.

మధు : నీలో యౌవన వికారము కనిపించుచున్నది ఏ యువకుడు నీ బాహులతచే గంఠము నలంకరించుకొని ధన్యుడు కాగలడు?

సీత ఏమో తెలియదు

రాము ఈమె యెవరి భాగ్యరాశియో తెలియదు ఎవరో బ్రహ్మర్షి కుమారకుడో నాకు లభింపజాలదు అనన్యలభ్యమైన నలభ్యయే. అందుచే నీమె ముఖారవిందమును నీరెదలో దాచుకొని యుంచుట వ్యర్థమేయగునేమో (ఆలోచించి) అట్లు కాదు వినుడు

"పరవనిత యైన నీమె దుష్ప్రాప్యమైన
నామనస్సెట్లు పరుగెత్తు నీమెపైకి?
మనసె కాద! కృత్యాకృత్యమతి వివేక
మునకు నుత్తమ ప్రామాణ్య మన ధరిత్రి "

సీత ఏలనో కాని నామనస్సు యుద్యానమున నమోకటివలె ప్రసన్నముగ లేదు శరీరమునకు జాల సంతాపము కలుగుచున్నది కదలసైన గదలజాలకున్నాను

మధు ఆ మణి శిలాతలమున గూర్చున్నచో భర్తృదారికకు ఒకుడు పరిమళముతో సుద్యాన వాయువు వీచి స్వస్థత చేకూర్పగలదు

సీత ఔను కూర్చుందము [(కూర్చుండును) దీర్ఘముగా నిశ్వసించి] సఖీ! నా శరీర సంతాపమధికమగుచున్నది

మధు (నళినీదళమున సీతకు విసరును)

రాము ఆమె శరీర సంతాపమున నేనును దహించుచున్నాను.

"కమల సౌగంధ్యోద్యానసరో
వారితరంగ ప్రభూత వాయువు సుమన
సౌరభము మందములయ్యెన
మీరుడు నక్కొచ దోడగ మిక్కిలి సకటా!"

కారణ మేమైయుండును? సరే తెలిసినది.

"మానసవేదనంబులలో
మానస మది భర్మమార్గమునిహి దలిర్పన్
మానసము వీడి దేహము
మానంబుగ దప్తమగుచు మండగ బోలున్."

సీత : నాతాప మీ చల్లని గాలివలన కాంతించుట లేదు. మీరు శ్రమపడవద్దు.

మధు (జనాంతికముగా) చంద్రకళా! సీతకుఁ గల్గిన సంతాప కారణము నిజమే. ఇది శరీర సంతాపము కాదు. మనస్సంతాపమే

చంద్ర రాముని మూలముననే యిది యని యామె సఖ్యము చెప్పదాయె

మధు : (జనాంతికముగ) అయ్యెడు రాముడు విశ్వామిత్ర పరతంత్రుడై దృఢవ్రతము నవలంబించి యున్నాడు. అతనిని లొంగదీయ సాధ్యమా?

రాము ఈ సంతాపము వలన నామె ముఖము తెల్లబడుచున్నను మఱియొక నూతనశోభ నే యందు చున్నది. ఆశ్చర్యము!

"కొందగంటిని గన్నుల కఱవు తీర
నమృతనిష్యంది యీ నీమె యాననశశి,
ఐన దాపంబు మిక్కిలి యధికమయ్యె
విధికృతంబులు బహుచిత్ర విధములౌర!"

చంద్ర (జనాంతికముగా) మఱి యుపాయ మేమి? ప్రియసఖి భర్తృదారిక శోచనీయావస్థలో బడిపోయినది

మధు (జనాంతికము) సరే ధర్మవిరోధము కాని ప్రణయము పరిగణింపదగినదే యని విశ్వా మిత్రుల మతము. అందుచే నీమె విషయమున నాయన ప్రసన్నుఁ జేయగును

చంద్ర (జనాంతికము) ఏదో యుపా యము చూతము

సీత : సఖులారా! ఎండ చాల బాధించు చున్నది

మధు . ప్రియసఖి! సీతా! చెట్టునీడనున్నావు ఎండయేమిటమ్మా!

సీత (లజ్జతో) ఇది నిజమా?

రాము

"చెట్టునీడను గూర్చుంటి జిరముగుండి
పవయుచుంటిని జలిగాలి స్పర్శమైన
నత్యధికమైన సంతాప మందుచుంటి
నేమి కానోవు గారణం బింతియెవుడు?"

"కాముజంబైన తాపంబు కాంతకంటె
బురుషునకు మిన్న యౌనుగాబోలు—కాదు
స్త్రీల విషయము నాకేమి తెలియు? ఏల?
యింత గొడవ? నేనాడుగా మాంతకుడను."

నేత్రానందదాయకుడగు నేయుత్తమునికొఱకో యీయామె విరహ మనుభవించుచున్నది వాడెంత ధన్యుడో! అన్యాపురక్తను గామింపకుండుట ధర్మ నియమము కాన నేవివిషయమునుండి మనస్సును మరలింతును

"ఉత్తమవివేకఫలము వశ్యేంద్రియత్వ
మంతియే కాని యవివేక మందరాదు
పిరతరమె సుఖమిచ్చు నేవిషయమైనయి
ప్రాజ్ఞతను గోలుపోవుట పాడికాదు"

మధు : (జనాంతికముగా) నేను స్పష్టముగా ప్రియసఖిని జూచినాను

చంద్ర (జనాంతికముగా) ఔను

మధు ప్రియసఖి! నీయీ సంతాపము మదన సంతాపమువలెనే యున్నది. ఎప్పుడా రాము నీ యుద్యానవనమున నీవు చూచితివో యప్పటినుండి నీ సంతాపమారంభమైనది. ప్రతి దినము వృద్ధి పొందు చున్నది. ఇది నిజమైన జెప్పు. ఏదో యుపాయము చూతము

రాము (వివి హర్షముతో) ఏమి? నేనే యామె తాప కారణమైతినా?

"స్మరణమున గాఢసంతాపభరము కలుగ
జంచలాక్షులు హృదిలోన మంచుకొంద్రు,
నన్ను సంతప్త నొనరించి ఖిన్నఁ జేయు
నామె. పూర్ణేందువదనరమ్యత్వ మహహ!"

ఆహా!

"స్వార్థబుద్ధిని నన్యదుఃఖాదికంబు
నెవ డుపేక్షించువాడు మానవుడు కాడు,
దుస్సహంబైన తాపంబుతో గలంగు
నామె బోధింతు నానంద మవిరళంబు"

సీత . నా మనో వికారమునకు గారణమేమో మీ యిరువురకు దెలియదా?

మధు తెలియదు.

సీత (సిగ్గుపడును)

రాము . ఛీఛీ. కష్టము. నా గాంభీర్య మగరము విధ్వస్తమైనది. అలగులు దీనులు మూర్ఖులు కామ్య కర్మము లాచరింతురు. ఉత్తములు ఫలాపేక్షలు కాక ధర్మార్థమే కర్మమొనర్తురు. కావున నేను ఫలాపే యఫలమో యామె కలత బోగొట్టుదును.

మధు . ఏ కారణమువలనో తెలియని నీ వంతాప మునకు నివారణోపాయమెట్లు మాకుముప్పు నీవు చెప్పనిచో?

సీత : చెలులారా! మీరు చెప్పిన కారణము నిజమే మీరు చెప్పనిదే మీచే నెట్లు చెప్పింప గలను?

రాము (సంతోషముతో) సంతోషము లైన విహితమగు కర్మకర్తము శేకపోదుకదా! ఈమె రెవరి కూతురో!

మధు చెలీ! వెంటనే యీ వార్త మహారాజా నకు విశ్వామిత్రునకు ఆర్యుడగు రామునకు దెలుపు దము

సీత (దీర్ఘముగా నిట్టూర్చి) ఒక పెద్ద సం॥ తి మీ రెరుగుదురు మఱచిరి

మధు : ఏమది?

చంద్ర నాకు దెలియును శివుని విల్లెక్కడిన వానికే తన కూతునిచ్చెదనని మహారాజా నిశ్చయించి నాడు అది దుష్కరమగుటచే రాముని కది సాధ్యమా యని ప్రియసఖి జడియుచున్నది

సీత (దీర్ఘముగా నిశ్వసించి) ఔను

మధు రాముడెంత సుందరుడో యంత బల వంతుడగుట శివధనర్భంగము గావింపగల సమర్థుడే

సీత కానివాడు నేను జీవింపలేను (మూర్ఛిల్లును )

చంద్ర : దేవతలారా! రక్షింపుడు సీత మూర్ఛిల్లి నది.

రాము : (నవ్వుచు తేరి) భయపడకుడు నేను ప్రియురాలి (అర్ధోక్తితో మానమూ వహించును)

మధు : ఆర్యునకు స్వాగతము. ప్రియసఖినిట్లు శోచనీయ నొనర్చుట భావ్యము కాదు

రాము అంతయు వింటిని ఈ పుణ్యాత్ము రాలి తండ్రి యెవరు?

చంద్ర . బ్రహ్మజ్ఞాననిధి-జనక మహారాజా

రాము . (తనలో) ఏ కుల కన్యయో యను కొంటిని ఆ కులము పవిత్రుడగు జనకమహార్షిది నాకొఱకైయీమె పరితపించుచున్నది శోభాకృతిగా నా సుఖము కొఱకే విధి యీమెను సృష్టించి యున్నాడు (ప్రకాశముగా) ఈమె సఖల మనో రథ మాగలదు కాని, నేనే యదృష్టహీనుడనని (అర్ధోక్తితో విషాదము నటించుచు దనలో) "వివేక వినయాపేతుడనని జగము తలంచు నేమో?

చంద్ర (తనలో) తెలియవలసినది తెలిసినది

మధు మహారాజా మిగుల దుష్కరమగు పణమే యుంచినాడు

రాము అదియు నేను వినియే యున్నాను

"శివుని వింటిని సజ్యంబు చేయగలుగు
మానవుని శక్తి దుష్కరమానటంచు
రాజా దీని బణంబు నా మొనజచేసె
ననుచు దలతును విఫల సుఖాశతోడ "

మధు నీకు ప్రియమే యగును

"పరమ వీరుడ వీవు దుష్కరము లైన
పని గలద నీకు నని నేను నమ్మెదను
నీవు మాసి మహా శౌర్య నిధివి గాన
నీకశక్యంబు గలద యీ లోకములను!"

చంద్ర ఆర్యపుత్రా! నీకు

"దేహమందున శౌర్యంబు దీప్తమూను
అధిక దుష్కర కృతిరైన నగును సాధ్య,
మల్పకాయంబు గలదియే లైన సింహ
మధిక కాయము గలయేన్గు నణచుగాద!"

(తెరలో) మహారాజా! ఇటు ఇటు

రాము అహా! భగవానుడు

"రాజత్వంబున సుస్థితుండు నయ
దుర్గాహ్యంబునా బ్రహ్మ స
త్తేజం బంది వెలుంగు రాజఋషి,
యుత్తీర్ణుండు జ్ఞానాంబుధిన్
భ్రాజిష్ణుండు విరక్తుడై మయిక
విజ్ఞానంబుచే సంస్మృతిన్;
రాజైయున్నను శాంతిమూర్తి
పరమప్రాజ్ఞుండితే వచ్చెడిన్ "

నేనిచట నుండదగదు పోయెదను. (నిష్క్ర మించును )

సీత : సఖులారా! ఇపుడేమి చేయుదము?

చంద్ర ఇపుడు క్రొత్తగా చేయవలసిన దేమి! మహారాజా వచ్చుచున్నాడు కావున ఎదురేగుదము.

సీత. నా సంతాప వృత్తాంత మాయన వినలేదు కదా?

మధు. నీవిట్లు శంకింపకు. ఆయన విన్నచో నీ సంతాప ప్రతీకారము చేయును

సీత. నాకష్ట సమయమున నన్ను బరిహసించుచున్నావు.

మధు: నీ దుఃఖ శాంతి యగునులే

సీత మరల వేళాకోళమా?

మధు. వేళాకోళము కాదు విను రాముడు కానరానిచో నీవెంత సంతాపపడుచున్నావో నీవు కానరానిచో నాతడు నంత సంతాపమే యందుచున్నాడు

సీత: పోవే ఆయన పేరెందుకు చెప్పెదవు?

మధు ఆయన మనమిత్రుడు కనుక.

సీత (కోపముతో) నీకట్లు తెలియును?

మధు (చెవిలో) ఇట్లు

సీత నిజమా?

మధు నిజమే

సీత. (లీలగా) ఏమే. అసందర్భ ప్రలాపము లాడెదవు? ఆ మాట నమ్మవచ్చునా?

(తెరలో) మహారాజా! ఇటు ఇటు
చంద్ర మహారాజా వచ్చినారు
(జనకుడు చేటులతో ప్రవేశించును.)

జనకుడు:

"అనుపమ సద్గుణాళి నలరారెడు
కన్యక గాంచి పెంచి యా
మెను విబుధుండు నిర్మలుడు
మేదుర సద్గుణ శాలియైన యా
క్కని కొసగంగ గాంచిన సుఖంబను
గాని యమోఘ్యవర్తి కో
క్కని కొసగంగ గాంచుటెడ
గద్దపరంపర చెప్పశక్యమే!"

సీత (చేరి) నమస్కారము (నమస్కరించును.)

జన. వత్సా! సర్వగుణనిధియగు భర్తను బడయుదువు గాక!

సఖులు: ప్రియసఖీ! తండ్రిగారిని వరయాచనము అశీర్వచనము నిందని కోరుకో.

సీత. (కన్నీటితో) తండ్రి పెండ్లిచేసి నన్ను దేశాంతరము పంపి వేయును.

జన దేశాంతరమో జన్మాంతరమో ఏమైనను జీవికి స్వకృత్యములు తప్పవు కన్నవారెల్ల మిన్న లగు బంధువులని తలచి యాతడు పోనపోవును ఇట్లు పోనపోని జీవియేయున్నాడు

ఏది యెట్లు జరుగవలసియున్నదో యట్లే జరుగును నీవేగవలసిన చోటికి యేగదవు విప్రయోగ భావముచే నీవనవసరముగా హృదయమును బాధ పెట్టుకొనకుము.

"కలిగియున్న దుఃఖంబును దొలచుకొన్న
నాను మిక్కిలి యానందమట్లు కాక
సుఖమెఱుంగక దుఃఖంబు చొప్పగన్న
నొక్క కార్యంబు కూడను జక్కబడదు"

సీత. (కన్నీటితో) తండ్రి మిన్న ధైర్యము తనయకెట్లు వచ్చును?

జన అవసరమునుబట్టి నీకును ధైర్యమదియే వచ్చును మగని ప్రేమ మెఱిగితివా మమ్ము వెంటనే మఱచిపోదువు

సీత తండ్రీ! అట్లనకుము

"ఎంతవఱకును సంస్మృతి యొసగు నాకు
నంతవఱకును నామనమందు దండ్రి
పరమపావన భవదీయ పాదపద్మ
యుగళి యెన్నండు మఱవంగనోప నేను"

జన వత్సా! మంచిదే అది సముదాచారమే నీవు భర్తతో వెడలిన వెనుక గలుగబోవు మా ఎడబాటును గూర్చి యాలోచింపకు.

"ముందు కాలంబునందు రాబోవు దుఃఖ
మెన్నడును గూడ దలపోయ నెంచరాదు
గడచిపోయిన కాలాన గన్న దుఃఖ
మెంత త్వరలోన మఱచిన నంత సుఖము"

అందుచే నీవు సఖులతో నేగి మేడముందుభాగమున గల బుద్ధివర్ధన పీఠమున గూర్చుండి మనస్సును వినోదపఱచుకొనుము. (చేటులతో) మీరు విశ్వామిత్ర భగవానులతో సంధ్యోపాసనమైన వెనుక నేను వచ్చినారని విన్నవించిన దెల్ల బరిపాలించెద నంటినని చెప్పి రండు.

అందఱు : చిత్తము. (జనకుడు తక్క అందఱు నిష్క్రమింతురు )

జన ఈ వేళ అయుగడియలకు వారు స్రోతాంత స్నానము విడచి ఆర్ఘ్యవిధానమున సీతను రాముని కిచ్చెదను ఏలన, కులమన్న

"పరమ విఖ్యాత మా రఘు వరకులంబు
రాముడు బుధుండు క్షాత్రవిరాజమాన
సుగుణ పుంజము సీతకు దగినవరుడు
ఆమె వలచిన దితని నింకేమి వలయు?"

ఇక శాంభవధనురారోపణ రూపమగు పణమునకు రాముడు నిలువగలవాడేయని విశ్వామిత్ర మహర్షి చెప్పియే యుండెను (ఆలోచించి) రాముడే యిది చేయలేనివాడు విశ్వామిత్ర భార్గవరాములను దర్పించిన నీక నిందులకు సమర్థుడెవడు? నా పణము యథా ఫలమునుగాని నిష్ఫలమునుగాని యొన్నడు నీయదు భగవానుడగు భార్గవరాముడు శాశ్వత బ్రహ్మచారి విశ్వామిత్రుడు వనవాసి నా పణము విని యెందఱో వీరులు విభ్రమముతో విచ్చేసి యది నిర్వహింపలేక నిందించిపోయిరి కదా ! విశ్వామిత్రవచనమున విశ్వాసముంచి యీ మహాభాగుని కొఱకెదురు చూచుచుంటిని (పరిక్రమించి మరల నాలోచించి) నా పరమసఖుడగు దశరథ మహారాజును విలువనంపెదను నా కోరిక పాటించి యాతడు తప్పక విచ్చేయును రాణులతోడను వసిష్ఠభగవానులతోడను కుమార మంత్రి భృత్య పరివారపురస్సరముగా విచ్చేయుమని కోరుచు నిప్పుడే దశరథుని కడకు దూతను బంపుదును మఱియు

"ఏ నృపులు వచ్చిన యీ వింటి నెత్తలేక
కడు నిరాసులునై పోవగనిరో వారి
నందఱను విల్వనంపెద నరుగుదెంచి
వార లీ యుత్సవము జూడవలయు నేడు"

అంతేకాక.

"ఈ పణము దుష్కరంబని యెవరు నన్ను
నింద చేసిరో వారు వారందఱరయ
గలరు రఘురాము శక్తిని, గాంచి మిగుల
సిగ్గుపడగాంత్రు తమ తమ చేవ తెలిసి."

ఇంకను

పరముండా హితుడైన యా దశరథున్
భార్యాపుత్రయున్ బిడ్డలన్
వరసంభావుల నా గృహంబున
మహానందంబునన్ గాంచెదన్
చిరకాలంబునకిట్టు లాతడును
నిర్నిద్ర ప్రమోదంబునన్
వరపుత్ర ప్రకట ప్రతాపముగనున్
వహ్వా! యనన్ లోకముల్ "

(నిష్క్రమించును)

ఇది షష్ఠాంకము.

## నిర్వహణాంకము

[అంత నూర్పుండి సదస్యులు, సభ్యులు, దశరథ మహారాజు కుమారులు, జనక మహారాజు, పరివారము, వసిష్ఠ భగవానులు, విశ్వామిత్రుడు, శతానందుడు, మంత్రులు, రాణులు, పరిజనులు, రాజులు ప్రవేశింతురు ]

జన (లేచి)

"తిమము నడచెడి జ్ఞానతేజమును గాంచ
బ్రహ్మమయముగ దోచు సర్వంబు ధర్మ
కర్మ మొనరించి లోక సౌఖ్యమ్ము కొఱకు
వార్త్మ విజ్ఞత నెల్లరు నలరవలయు
కర్మపరము సమస్తంబు కావ నిర్మ
విపెన శత్తుండగా దెట్టి విజ్ఞుడైన
ధర్మ యుక్త కర్మంబులు నిత్యంబు చేయు
సజ్జనుడు నిర్మలంబైన శాంతిగనయు
ఒక్కడయ్యును సూర్యుండు పెక్కుగతుల
గాంతి పుంజము వెదజల్ల గాంచునట్లు
ఒక్కటయ్యును నాత్మతా వెక్కుగతుల
వివిధ కృత్యంబు లొనరించి వెలయుచుండు
విధి విధించెను యజ్ఞంబు విజ్ఞులకును
యజ్ఞమున దేవతలు ప్రీతి నందు చంద్రు
యజ్ఞమున గొల్తు రీశ్వరు నఖిల జనులు
యజ్ఞమొసగును గామ్యఫలాళి నిజము."

నా యజ్ఞము సమాప్తమైనది ఇక అర్ఘ్యవిధి ననుసరించి రఘుకుల దీపకుడగు దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడు సకల క్షత్రకుల ములాలంకారుడు, భుజబలోద్భాసిత భగ్నాశేశ మహాబల వీరాధివీరోగ్ర చాపుడు, భీమయాతుధాన వనవిహారిత తపోవన భయ సంశయుడు, సుకృతిజన సుమః కుముద ప్రసాద

ల్లోకి పరీక్షగా అదుర్దాగా చూసిపోగింది దూరాన్ని రంగురంగుల లైట్లతో స్టేడియంతా దీపాల్లో జగజ్జేగీయమానంగా వుంది

ఆ దంతావళం అలివేలు పెట్టెను కొంచెం అడ్డంగా వున్నదని తెరంమీద 'కాళ్లకడ్డం పెడత పెట్టి!' అని కసిదీర తిట్టింది. అలివేలు వూరుకో లేదు 'పెట్ట పెట్టి గిన్నె పెట్టి అనబోకు పోలీసుల్ని పిలుస్తాను' అంది మళ్ళీ అంతా గొల్లుమని నవ్వారు రైలు ఆగింది అహోబలరావు కిటికీదగ్గర్నుంచి అలివేలు భుజంమీద తట్టాడు ఉలిక్కిపడి 'మీరా ' అంది 'వచ్చావా—' అన్నాడు కళ్లు మిలమిలా మెరుస్తూండగా యింకేం చేసుకున్న ముఖంతో 'వచ్చాను' అంది అలివేలు

ఆ దంతావళంకోసం వచ్చిన విజయ, తల్లిని ముందు పలకరించకుండా 'బావా! బావా! ఆయనే మా క్రొత్త లెక్చరరు' అని ప్రసాదరావుకు అహోబలరావును చూపెట్టింది

## 6

చేల కష్టంబడి పొలాల్లోంచి రెండెడ్లబండిని తోలుకెళ్లినట్లుగా దంచుకున్నాడు ఉపన్యాసం అహోబలరావు విషయం సత్యాగ్రహింసలు – గాంధీ, గౌతమ బుద్ధుడు పాఠం అక్కర్లేనివాళ్లు బందరు రైలుమీద బల్లిలా పాకుతూన్న గూడ్సు రైలు పెట్టెలను లెక్కపెడుతున్నారు ఉపన్యాసం డొంక తిరుగుడుగా వుంది అవసరమైన విషయాల్లోంచి అనవసరమైన విషయాల్లోకి దాంట్లోంచి దీంట్లోకి దీంట్లోంచి దాంట్లోకి కప్పదాట్లు కుప్పిగంతులు వేస్తున్నది వినాయకో సమర్థతతోనే చెప్పుకుపోతున్నాడు. కొందరు కుర్రవాళ్లు కబుర్లు ప్రారంభించారు. కొంతమంది మెల్లమెల్లగా గోడవారల్నుంచి జారుకొంటున్నారు. ఇంకా మరికొందరు ఉండుండి 'చుట్టా బీడీ సిగరెట్'—'చా! చా! గరం చా' అని కేకలేస్తున్నారు అహోబలరావు దవ్వున నీరసించి యిట్లా గన్నాడు—'మీ కెవరికీ విషయం పట్ల ఆసక్తి వున్నట్లు కనుపట్టంలేదు. వినా చదువుకో టానికి వచ్చినట్లు లేదే ' అని. వెనుక బెంచీలోంచి 'చాలా చక్కగా గ్రహించారు.' అని – యింకొక చప్పట్లను 'బాగుశాస్త్రు' అని. వెకిలికిలోటలుంచి

'ఈవాళ్టికి చాల్లెండి మాస్టారూ!' అని సలహాలు సందేశాలు ఆదేశాలు వచ్చిపడ్డాయి. అవతలిల్లలు నవ్వుతున్నారు వాళ్లు ఎందుకు నవ్వుతారో వాళ్లకే తెలియదు అహోబలరావు మళ్ళీ పట్టువదలకొద్దీ ఉపన్యాసాని కందుకున్నాడు తక్షణం విషయం 'ప్రపంచ శాంతి'లో ముడిపెట్టబడింది. ఆర్థికశాస్త్రానికి సంబంధించిన, రాజకీయాలకు సంబంధించిన ప్రశ్నలు లేచి తలాక్కరూ వేయసాగారు చివరకా క్లాసు పరశురాం లైన్ సర్కస్ గా మారింది అహోబలరావు కుర్చీ వదిలి బెంచీల మధ్యకొచ్చి గర్జించాడు 'మీరు గొడవ మానుతారా లేదా?' అంటూ ఒకటికి రెండు సార్లు పొలోమంటూ అంతా లేచి 'క్రొత్త మాస్టారికి జై! క్రొత్త మాస్టారికీ జై!' అంటూ యువకుల కొచ్చి పడ్డారు

ఖిన్నవదనుడై అహోబలరావు యువకులను రాగటం షెల్ల దగ్గర బయాలజీహాల్లో జూ ఆలజీ ప్రాక్టికల్ చేస్తున్న విజయ చూసింది చూసి ప్రక్కనున్న స్నేహితుల చెవిలో ఏదో చెప్పింది అంతా అహోబలరావు సమీపాన్నుంచి పోకుండటాన్ని కనిపెట్టి పకపకా నవ్వారు హాలు హాలంతా పకపకలతో ధ్వనించింది అహోబలరావు కోపంగా విజయకేసి చూశాడు విజయ కటువైన మంచి హాసాన్ని విసిరింది

'చాల్లేవే—ఏమిటా విసురుడు!' అంటూ వచ్చింది ఒకతె.

'అదికాదే—క్రొత్తవాళ్ళనంత బెదరగొట్టాలేమి విజయా!' అంది మరొకతె అంతా నవ్వారు.

బల్లమీది చెక్కపై నాలుగువైపులా మేకులు దిగగొట్టి వెల్లకిలా పడుకోబెట్టబడిన కప్పకు రక్త ప్రసార మెట్లా జరుగుతుందో చెప్పి, గుండె చలనం గూర్చి చెబుతున్నాడు విజయ పరధ్యానంగా వుంది సన్నటిచాకులు చిన్నచిన్న సూదులు వేళ్ళలోంచి తీసి కుంటూ 'చూసే యిందిరా' అని పిలిచింది ఇందిర నోట్సు వ్రాయటం ఆపు చేసి 'ఏమిటే అంత అర్జంటు?' అంటూ వచ్చింది.

'లేడీస్ కల్చరల్ అసోసియేషన్ ప్రారంభోత్సవం ఎప్పుడే?' అంది విజయ

'అధ్యక్షుం యెవ్వరెందుకే?' అంది ఇందిర.

'పనుందన్లే చెప్పు. ఎప్పుడు ప్రారంభిం చటం?' మళ్లీ రెట్టించింది

'ప్రిన్సిపాల్నడిగాకే. ఇవ్వాళేమధ్యాహ్నం పోయి అడుగుదామా?'–విజయ ఆలోచించి 'సెక్ర టరీని పిలవ్వే' అంది సెక్రటరీవచ్చి 'ఎందుకే విజయా' అవతల టేబిల్ దగ్గర సగం సగం ప్రాక్టి కలు చేస్తూవచ్చావు చెప్పు'

'మన ఆపోసిరేషన్ 'షో' ఎప్పుడు చేద్దామే ' అంది విజయ 'ఇప్పుడెందుకే ఆ చర్చ ?' అంది సెక్రటరీ

'ఆఫీసు వేరర్ గా నేను క్రొత్త లెక్చరర్ను సూచిస్తాను మీరంతా వోట్లేయ్యాలి '

'ఎందుకే—పాపం అతన్ని యేడిపించటం ?' అంది ఇందిర సెక్రటరీ అందుకుంది 'పాపం అంటూ వెనకేసుకొస్తోంది దీనికేమన్నా మేనత్తకొడుకేమోనే వాడు '

విజయ 'అల్లానే వుంది కాకపోతే యేమిటి ?' అంది హేళనగా ఇందిర కోపంగా—'ఆ దగ్గర వరసలన్నీ ఐతే మీకవాలి ? నాకెం—నేను నా వోటు వయ్యను '

'ముడిచిరల్లో పెట్టుకో ' అంది సెక్రటరీ ఇందిరకు కోపమొచ్చి లిన బల్లదగ్గరకు వెళ్లి ప్రాక్టికలు చేస్తోంది విజయచాకులు మాదులలో బల్లమీది కప్పను పైకెత్తిన కోస్తూ సెక్రటరీ చెవులో ఏమేమో చెప్పి నూరిపోస్తోంది ఇద్దరూ మధ్యమధ్య నవ్వు కుంటున్నారు విజయకు ప్రాక్టికల్ మీద దృష్టిలేదు సెక్రటరీ బల్లమీదకువంగి విజయ ముఖంలోకి చూస్తూ మాట్లాడుతోంది తీరుగా సగంసగం తెలివిలోకి వస్తున్న కప్పపోయే ప్రాణంకోసం పెనుగులాడుతూ నాలుగుకాళ్లను కుంచించి తిరుగుబాటు చేసింది క్లోరోఫారం పట్టుతప్పి కప్ప నాలుగుకాళ్లు ఎగర తన్ని సెక్రటరీ ముఖానికొచ్చి గుద్దుకుంది.

'అమ్మ బాబోయ్' అని సెక్రటరీ భయంతో కెవ్వుమని కేకేసి దూరంగా పరుగెత్తింది విజయ తెల్ల బోయి చూస్తూ నిలబడిపోయింది నాలుగుదిక్కుల్నుంచి విద్యార్థినులు అధ్యాపకులు, అటెండర్లు ఏమిటి ఏమిటి అంటూ పరుగెత్తుకొచ్చారు.

భయపడిపోయిన సెక్రటరీ యేమన్నా అంటుందే మోనని అధ్యాపకుడు అటెండర్ని కేకలేస్తే అతను 'పొరపాటు తుడిచిపెట్టాలి క్లోరోఫారం సరిగా యివ్వ లేదు కాబోలు' అని నసిగాడు విజయ సెక్ర టరీని నడిపించుకుని వైటింగురూంలోని కెళ్ళ బోతూంటే అందరూ యీ అమ్మాయి ముఖంనిండా బట్టలనిండా యీ నెత్తురేమిటి మరకలేమి టని అడిగేవాళ్ళే అడిగి తెలుసుకున్నాక పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవాళ్ళే ఇందిర అవత కాలంకోసం కాచుకు కూర్చున్నది విజయ, సెక్ర టరీ, బట్టల్లో ఎక్కుతూండగా 'ఏమే – యివాళ గలేవా 'షో' ఎల్లాగుందేం?' అంది సెక్రటరీ ముఖ మంతా వలుపు చేసుకుంది విజయ 'ఇప్పుడా, యిదా వేళాకోళానికి సమయం' మన్నట్లు చూసింది

ఇందిర మాటలో మాట కలిపింది—'జరిగిం దేదో జరిగింది కాని – యింకెప్పుడూ అనవసరంగా మనకు సంబంధంలేని విషయాల్లోకి దిగి యితరుల్ని అవ మానించటానికి పన్నాగాలు పన్నకండి ' దీంతో సెక్రటరీ దిట్టపోయింది విజయ ఉడుకుమోతుతనం గానే అంది—'నీకు మహ బాగా తెల్సులేవే— అందర్నీ వెనకేసుకొచ్చి మాట్లాడుతున్నావ్ ఇవాళ ఏదో ఆ వెధవ క్లోరోఫారం సరిగ్గా యివ్వనందుకు ఆ కప్పకు తెలివొచ్చి మేకుల్ని ఎగరగొట్టిందని దానికీ దీనికీ ముడిపెడ్తున్నావు వాడెంత రోగ్గో నీకు తెల్సా—నన్ను సైకిలుమీదనుంచి పడేశాడు నిన్న మా అమ్మ కలకత్తా నుంచి వస్తూంటే రాజమండ్రిలో ఎక్కిందట – యీయనగారి భార్యామణి మాట్లాడే వంటే నీ మాటా ముల్లె కిటికీలోంచి గోదావరిలో పారేస్తానని బెదిరించిందట ఇద్దరికిద్దరే వీడికీ వీడి పెళ్లానికీ యిద్దరికీ బుద్ధి చెప్పాలి ' అని

సెక్రటరీ మళ్ళీ అంది—'ఒసే ఇందిరా– నీ వన వసరంగా దీంట్లో జోక్యం కలగచేసుకోకు వాళ్లిద్దరికీ బుద్ధి చెప్పందే మేం నిద్రపోయేది లేదనుకో '

ఇందిర మళ్ళీ కప్ప సంగతి గుర్తుకు తెచ్చుకుని పకపకా నవ్వుతూ 'నా కెందుకు జోక్యం—నేను కలగచేసుకుంటే ఆ కప్ప ఎగిరి నామీదే పడివుండేది యింకా ' అంది. ఇంతలో సిటీబస్సు వచ్చింది ఇందిర బస్సులోకి వెళ్లింది 'ఇకేముంటే యింత చెప

నరంగా చెప్పలేంతటి తీవ్రంగా లేకుండా మాట్లాడుతుంది' అంటి కర్రటకి. చెవ్వా కోలు 'ధళ్'మంది. కాని వాళ్లకా 'బంయ్' మంది

# 7

రోజులు గడుస్తున్నా కొద్దీ చిత్రవిచిత్రమైన సంఘటనలు జరుగుతూవచ్చాయ్. ప్రపంచంలోని ఒకరకపు అసందర్భపు మనుష్యుల్లో ఒకడైన అహోబలరావు 'శాస్త్రజీవితం' దినదిన గండం, నూరేళ్ళాయుష్షుగా మారిపోయింది. ఉపన్యాసాలివ్వటం మొదట్లో క్రొత్త అనిపించినా క్రమంగా కొన్నాళ్ళకు మామూలై పోతుంది అందరికీ. ఇతడి విషయంలో అట్లా కాలేదు. చిన్న చిన్న అడ్డంకులు సంఘటనలు వచ్చి వ్యక్తిని నిరుత్సాహపరిచాయి. తరువాత స్టేజంటే భయం దస ఎక్కువవుతూ వచ్చింది కాని తగ్గలేదు. చక్కగా కష్టపడి అవీ ఇవీ చదివి మరీ వెళ్ళేవాడు—కాని నోరు విప్ప నివ్వరే! ఖర్మ!

ఇంటి కొచ్చాక పెద్ద పెట్టునరాగా రెట్టాలవిటించేది అతని! ఎవరితో మాట్లాడకుండా దిగాలు పడి కూర్చుండి పోయేవాడు. అర్ధరాత్రి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి 'భయం' అనేవాడు. 'నా చేయి మీమీద వేస్తాను మీరు సుఖంగా నిద్రపొండి మీ కెందుకు భయం' అనేది అలివేలు.

ఒక రోజున గదిలో కూర్చుని కాంపొజిషను పుస్తకాలు సంస్కరించటానికి బదులుగా రెండు చేతుల్తో తలగట్టిగా పట్టుకుని వెక్కి వెక్కి యేడవటాని కారంభించాడు. అలివేలు వంటయింట్లో కాఫీ కాచటంలో మగ్నురాలైవుంది.

'మరో పది నిముషాలకు కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ—'కళ్లు ఎర్రగావున్నా యేమండీ?' అంది చకిత వదనరా. అహోబలరావు ఉత్తరీయంతో కళ్లొత్తుకుంటూ 'ఏమీ లేదు' అని కాఫీ కప్పందుకుని రెండు గుక్కలు పీల్చి ముఖాన్ని ప్రక్కకు త్రిప్పి కిటికీలోంచి ప్రొద్దుగ్రుంకటాన్ని తిలకించ సాగాడు. పడక కుర్చీ వెనక్కవచ్చి నిల్చొని 'నామీద వొట్టే. ఏమీ లేదూ?' అంది గోకాయిస్తూ అలివేలు.

ప్రక్క వాటాలోవాళ్లమ్మాయి యేడ్చి గోలచేస్తోంటే—ఉల్లల్లా హాయీ! యేడుస్తవు యేడుస్తవు వెర్రి నాగన్నా! యేడిస్తే నిన్నెవరు యెత్తుకుంటారు?' అని తల్లి ఓదారుస్తోంది. అలివేలు కాస్సేపు నిశ్శబ్దంగా నిల్చొని 'దీపం వెలిగించుకొస్తాను. అవతల చెబుదురుగాని లెండి అన్నం పెడతాను' అని గిరుక్కున వంటయింట్లోకి వెళ్లింది.

అహోబలరావుకు వెనకటి సంగతులు ఎంత వద్దనుకున్నా జ్ఞాపకానికి రాసాగినై. అలివేలు తన్ను యేరికోరి వరించి చేసుకుంది. చెంపకు చేరవేసి కళ్లు—పిల్లా అహోబలరావు కివ్వడమేమిటి అన్నారంతా. అసలయితే చదువుకున్నాడు గాని, ఎక్కడా ప్రాపంచికజ్ఞానం, తెలివితేటా, అందం, మనిషిలో నాజూకీ గాని లేవు. కోతి ముక్కుకి దొండపండు కట్టినట్లు ఏమిటిది? అంటే అలివేలు సమాధానమిచ్చింది 'నాకు అందం అక్కర్లేదు ఎక్కువున్నా అందాన్ని కొరుక్కు తింటామా? అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది. ఈవాళ నలకూబరునిలాంటి వాణ్ణి తెచ్చి కడతారు రేపు ప్రొద్దున్న వాడికే మహారోగమన్నా రావచ్చు అప్పుడా అందమంతా పోతే - అటువంటి అందాన్ని చూసి పెళ్లి చేసుకున్నా నాకేం కావాలి?' అంది పెళ్లికూతురు.

ఇవి మాటలు చెప్పిన పక్క యిప్పుడుంటే యిక్కడుంటుంది అన్నారంతా. తల్లి అడిగిందట—'ఆస్తి మాటో—లక్షణమైన బంగారపు బొమ్మలాటి పిల్లనిస్తే, తిండి బట్టా యిచ్చి సుఖపెట్టే చోటు అవునో కాదో కాస్త మాకుకో నచ్చాల్లదు.' అని. అప్పుడు కూడా అలివేలు కొంచెం మాటలు మానలేదు.

'డబ్బు కూడా అట్లాంటిదేగా అమ్మా. అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది. రోజూ మనం ఎంతమందిని చూడ్డంలేదు లక్షాధికారులు భిక్షాధికారులు కావటం లే—'

తల్లికి ఉత్తరువులో కారం వేసి రాచినట్లైంది. దాన్తో అదిప చిరాకుపడింది.—'ఈ అడ్డదిడ్డం మాటలన్నీ చెబుతున్నదానివి నువ్వు నిజానికి మొగుడితోటి కాపురం చేసేదానివేనా?' అని.

అహోబలరావు అనుకున్నాడు—యిప్పుడీ బంధం వుండేకోట అన్ని ముక్కూ త్రెంపుకుంటా

మన్నా తెగవు. లేనిపోట ఎంత అతుక్కుందామని ధీరత్వప్రయత్నం చేసినా అతకదు ఆ అతుకులు గగన కుసుమాలుగానే వుంటాయి. ఎవరి చేతి మెతుకులు ఎవరికి ప్రాప్తో, ఏపిట్ట ఏ చెట్టుతో కలిసి గూడు కట్టుంటో చెప్పటానికి నిజంగా ఎవరికి తెలుసు ?

ఎలిమెంటరీ స్కూల్లో చేరినప్పట్నుంచి ఆనర్సు క్లాసు పూర్తయేవరకూ యీ పదిపదిహేనేళ్లలోనూ ఒకే ఒక రకపు మనస్తత్వాన్ని పెంపొందించుకున్నాడు అహోబలరావు జీవితం పొడుగునా అపహాస్యాలకు, స్నేహితుల ధిక్కారింతలకు, వెకాకోళాలకు బలిఔతూ వచ్చాడు అంట కత్తెరలోంచి క్రాపింగ్ వరకూ వచ్చినా డబల్ బ్రెస్ట్ కోటు వేసినా, ట్వీడుసూటు వేసినా అతనూ అతడి నడకనూ కతయోజనాల దూరంనుంచి దుర్భిణీ వేసి చెప్పవచ్చు ఇంటర్మీడియేటువరకూ అతను హాస్టల్లో త్రికాలాలా సంధ్యావార్చేవాడు అక్కడికి మెస్ రెండుమైళ్ళదూరం వుండేది ఆ రెండుమైళ్ళూ పెద్దాపురం పట్టుపంచె కుచ్చెళ్ళుగోచీపెట్టి తడిఉత్తరీయాన్ని భుజాన్నేసుకుని చేతిలోని రాగిచెంబుతో భోజనానికి శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరాయుడుగారిలా బయల్దేరి వారిసంటబడిపోతూవుంటే, ఆ పిలక గగనసీమల్లో సంచారంచేస్తూవుంటే, క్రొత్తగా మొదటి సంవత్సరంలో చేరినవాళ్లే దగ్గర్నుంచి, ఫైనలియ్యరు వరకుఅవ—మగా అన్న విచక్షణాభేదం లేకుండా అంతా నమస్కారాలు చెల్లించి భక్తితో శ్రోత్రియుల్పేపేవారు కొందరు భక్తగణంలోనివారు అతన్ని అక్కడే నిలేసి లెక్కలూ ఇక్ట్రా తెలియనివి చెప్పించుకుని మరీ వదిలేవారు

అహోబలరావు రామానుజాలవారి మతానికి హృదయాన్ని అంకితం చేశాడు విష్ణుచిత్తీయము అతడు తలక్రింద పెట్టుకు నిద్రపోయే గ్రంథం అహోబలరావు విశిష్టాద్వైతికూడా—పరబ్రహ్మోత్కృష్టి తను దచ్చినా వప్పుగోడు చరిత్రకారులు కొంత కుంది కాలేజీలో దసావుసనే రోజుల్లో అహోబలరావుకి 'ప్రకరాభ్యుదయ'నే గౌరవ నామం వున్నట్టు కూడా చెబుతారు అతను అన్ని తరగతుల్లోను ఉత్తమశ్రేణిలోనే వచ్చాడు. కాని ఆనర్సులో సెకండ్ క్లాసు. అక్కడే వచ్చింది గట్టి చిక్కు, విశిష్టాద్వైతం కొంపతీసింది.

ఆచార్య శివశంకరరావుగారు ఎవరో చెప్పారు, అహోబలరావు ఎంత సూపర్ స్టిషన్ మనిషంటే అతను వసుకుత్తాన్ని స్పృడు శివ శివా! అనిగాని, హర హరా! అని గాని ఎవరైనా అన్నట్టయితే చెవులు రెండూ మూసుకుని వినపడనంత దూరం పరుగెత్తేవని ఆయన ఒకరోజు స్వయంగాపిలిచి 'నాపేరేమిటి చెప్పమ'ని అడిగాడు 'హరిహర్' అని చెప్పవన్నాడు అహోబలరావు అరుసూరు కాని నారాయణని చెప్పి వైష్ణవ నామోచ్చారణచేయ వచ్చాడు. అతను తిరువాయాన్ని తీర్చి దిద్దితే యస్. యస్ యం రైలుపెట్టెమీది పట్టి వర్ణనాలకన్నా ఎక్కువ స్పష్టంగా గోచరించేది చివరకా విశిష్టాద్వైతమే అతడి ఫస్టుక్లాసు కలన్ని దూరంచేసి మరీ వదిలింది. ఐతే యూనివర్సిటీకల్లా ఫస్టుగా లెంపలో నిల్చోవలసినవానికి ఫస్ట్ క్లాసు రాకపోగా, మెడపట్టుకు గెంటితే సెకండ్ క్లాసు గుంపులోకొచ్చి పడ్డట్టు తెలియగా ఆ తెలిసినరోజుల్లోనే అహోబలరావును గంజాకానివేసి రైల్లో ఎక్కించాల్సినంత పనయింది తరువాత కొద్దిరోజులకేగా జరిగింది కాన్వొకేషను. అప్పటికి ఫస్టుక్లాసు రాలేదేమా అన్న విచారం మానవుడ్ని పట్టుకు వదల్లేదు ఉద్యోగం దొరికాక యిప్పుడావిచారంమాయమైంది దానికితోడు లోకంలో బ్రతకటానికి జీవితయాత్రను సరిగా నెగ్గుకురావటానికి ఒక యూనివర్సిటీడిగ్రీలే చాలవని ఎన్నో ముసుగులు మెలుకువలు మాయలు మోసాలు కుతంత్రాలు నేర్చుకోవాలని లేకపోతే అధోగతి అన్నది నిశ్చయమే! అని తేలింది

అలివేలు దీపం వెలిగించుకొచ్చి—'ఇంకా యిక్కడే కూర్చున్నారేం? నిద్దరాయకుపో లేదా—' అని ఆశ్చర్యంతో అడిగింది.

'ఇటురా కూర్చో' అలివేలు మాట్లాడకుండా వచ్చి కూర్చొని, 'ఎందుకండీ అంత దిగాలుపడిపోయి కూర్చున్నారు యింట్లో యీనాళ మీ అమ్మమ్మ యేమన్నా జ్ఞాపకానికొచ్చిందా!' అని చెంగు చాటు చేసుకుని నవ్వింది అహోబలరావు అలివేలిని చూస్తూ—

'ఇక మనం అమ్మమ్మనే జ్ఞాపకం చేసుకుంటూ కూర్చోవాలి.'

'ఏం అలా అంటున్నారు?' అని తన చేతిలోకి అతడి చేయిని తీసుకుంటూ అంది

అంత అందమైన కళ్ళల్లోకి చూస్తూ—'నేను చెప్పలేను చెప్పి నీ మనసుకూడా పాడు చేయలేను' అన్నాడు సంశయంగా

'నా మనసు మీ మనసులాటిది కాదుగా' అంది అలివేలు

'ఏమైనా పాడవుతుంది ఎందుకు చెప్పటం?'

'చెప్పకపోతే వాచుకోండి రెండి భోంచేద్దాము'

'నా ఆకలి లేదు నువ్వు తిను'

'మీరు తినకుండా నే చెప్పానన్నా తిన్నానా?'

'ఇవాల్టికి తిందూ— నా మనసు బాగులేదన్నానుగా'

'ఏమిటి ఆ విజయ అన్న అమ్మాయి యేమన్నా చేసిందా?' అలివేలు నవ్వు నాపుకుందుకు యత్నిస్తూ ప్రక్కకు తిరిగి అంది

'ఏమిచెయ్యాలో అదే చేసింది ఐనా అమ్మాయి నవశలసిన పనేముంది మన ప్రారబ్ధమే అట్లాగుంది ఆ యనేం చెప్పటం లేదనీ, యీయన మరు అక్కర్లేదంటూ డెప్యూటేషను వెళ్లారు ఉద్యోగం వుంటుందో ఊడుతుందో తెలీదు ఇటువంటప్పుడు అన్నం రొట్టెలాయిస్తుంది నావ్వు?'

'వోస్—యింతేనా!' అంది అలివేలు

'ఏం యిది చాలదా?'

'అదికాదండీ—మీ కెందుకు కోపం ఉద్యోగ్యం వెయ్యటం కష్టంగాని తియ్యటం అంత తేలికకాదు'

'ఓహ్హో—నీకు బాగా తెలుసు'

'అబ్బ! నాకు తెలుసండీ. మీకేం ఫరవాలేదు వచ్చి భోంచెయ్యండి'

'నేను తన్ను చాలామట్లు అవమానించటానికి ప్రయత్నించినట్లు ఆ అమ్మాయి రిపోర్టులో వ్రాసింది' అన్నాడు దిగులుగా

అలివేలు గది ప్రతిధ్వనించేట్లు నవ్వి— 'మీరా—మీరు నిజంగా అటువంటిపన్లు చేశారా?' అంది.

'నే చెప్పందేదూ చెయ్యలేదు. చెయ్యను.'

'అవమానించటానికి ప్రయత్నించటం అంటే'

'నాకొంద—నే చెప్పందేదూ ఆ అమ్మాయి ముఖంలోకి చూసి నవ్వవన్నా నవ్వలేదు'

'మీరు నిజంగా అట్లాచూసి నవ్వివుంటే కథ యింతవరకూ రాక పోను'

'అలివేలూ—ఏమిటే వేళాకోళం? యిది ఎటువంటి సమయం—రేపు మనం ఎక్కడ తలదాచుకోవాలి' ఆ ఆలోచన వచ్చేసరికి బుర్ర పగిలిపోతుంది—'

'ఏమిటండీ—బుర్ర పగిలేది? నిజంగా తన్ను అవమానించే ప్రయత్నాలు మీరు చేస్తున్నట్లు ఆ అమ్మాయి వ్రాసిన రిపోర్టు ఆధారంచేసుకొని మీ మీద చర్య తీసుకుంటారనా?'

'వో తప్పకుండా'

'అప్పుడు చక్రం అడ్డువెయ్యలేనో '

'ఏమిటి నువ్వా ' అన్నాడు కుర్చీలోంచి లేచి అహోబలరావు

'అవును—నేనే ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళినా ఆపితేం చూసి గల్చుకవస్తాను మీ కోసం నేను ఏది చెయ్యలేను?' అహోబలరావు 'ఊ నా చేయి పట్టకో—' అలివేలు తలుపులు తెరిచివచ్చి 'అందివ్వండి' అంది 'ఇదుగో— అమ్మయ్య యిప్పుడు కుర్చీలోంచి లేచాను ప్రాణం ఎంత తేలిగ్గా వుంది.' వంటయింట్లోకి నడుస్తూ 'ఉంటుంది మీకు నిజంగా ఆ పిల్ల అంటే అంత భయమేమిటండీ?'

'భయం కాకపోతే—ఆ అమ్మాయిని రెండు చెవులూ నులిమెయ్యమనా, గోడకుర్చీ వేయించమనా ఏమిటి నీ అభిప్రాయం?'

'అంతకన్నా ముఖ్యమైన శిక్షే వుంది గట్టిగా రెండు చేతుల్లోకి తీసుకుని నలిపేసి వుంటే ఆ అమ్మాయి యిట్లాటి పెంకెపన్లు ఎప్పటికీ చెయ్యకుండా వుండేది?'

సీటు వాల్చుకుని కూర్చొంటూ 'ఆ పని నేను చెయ్యాలనా—'

అలివేలు కంఠం ఎత్తిపట్టుకుని 'నిజంగా మీరే ఆ పని చేసివుంటే నా కెంత గర్వంగా ఉండేదని.'

'ఊరికే పైకంటావు నేను చెయ్యగలిగి చెయ్యలేనని తెలుసు గనక '

అలివేలు నవ్వి 'అందరికీ మల్లే అమాయకపనతనా—ఒక్క నాటికీ పనను మీ రా పని చెయ్యకండి మళ్ళీ ఆ అమ్మాయి '

'ఛ ఛ నే నన్నందగ్గిర్నుంచి లేచిపోతాను మళ్ళీట్లా మాట్లాడారంటే '

'మాట్లాడను లెండి ఈ పచ్చడి కల్పుకోండి యిది మీ కిష్టమని చేశాను '

పచ్చడి వాలుక్కి రాసుకుని 'నీ చేయి దివ్యమైన రుచుల్ని పుట్టిస్తోంది వుండు నా బుజంమీద చెయ్యేస్తా వేమిటి? అదుగో వాళ్లెవరో కిటికీలోంచి చూస్తున్నారు '

'పోండి. ఎవరూ లేరు అంతా అబద్ధం ఇవ్వాళ నేను మడికట్టుకోలేదు తెల్సా ' చిత్తం గ్రహించా నన్నాడు అహోబలరావు చందమామ వెన్నెలలు విరియించాయి సన్నజాజులు నవ్వినై

## 8

తెల్లారి లేస్తూనే 'యీవాళ నన్ను మాట్లాడించకండి మీ పన్లు మీరు చేసుకోండి నా కూ పన్లున్నాయ్ ఇంటికి తాళంవేసి మధ్యాహ్నం అలా వెళ్లివస్తాను కొంచెం పర్మిషను యిస్తారా?' అంది అలివేలు

'విషయం చెప్పు' అన్నాడు టూత్ బ్రష్ తిరగేసి తల బరుక్కుంటూ—

'అసలు విషయం ముందు చెబితే కథ ఎప్పుడన్నా రక్తి కట్టుందీ?' అంది కాఫీకోసం కుంపటంటిస్తూ అలివేలు

'ఇప్పుడు నువ్వు నాకేమిటి కథ చెప్తావ్?'

'మంచికథ అనగా అనగా ఒక అబ్బాయి వున్నాడు ఆ అబ్బాయి ఒక మంచి వాజాలైన అమ్మాయిని సైకిలు మీంచి పడగొట్టాడు. అప్పట్నుంచి వాళ్ళ మనస్సులో రాగద్వేషాలు రాజుకొంటూన్నై.' అహోబలరావు పోరుమంగా— 'నేను నువ్వు చెప్పేకథ వినదల్చుకోలేదు. నీకు ఆకథలో సంబంధంలేదు.'

'సంబంధం లేదంటే మీకు ఉద్యోగం వూడుతుంది.'

'ఐతే యింతకీ నువ్వేమిటి చెయ్యదల్చుకున్నావు ఇల్లిల్లూ తిరుక్కుంటూ వెళ్తానన్నమాట. నా అవస్థ నే నేదో పడ్తాను కావలిస్తే క్షమాపణ పత్రం వ్రాసియిస్తాను ఇవ్వెందుకు నీకు పుణ్యముంటుంది—ఎక్కడికీ వెళ్ళొద్దు '

'అవసరంగా మీరా అమ్మాయికి క్షమాపణపత్రం వ్రాసియిచ్చి మర్నాడు మీరా కాలేజీలోనే పాఠం చెప్పదల్చుకొన్నారా? అట్లా ఒక్కనాటికి జరగటానికి వీల్లేదు నేను వెళ్లి మీ విజయను కల్సొగుని మాట్లాడివస్తాను మీ తరఫున నాకు వకాల్తీ యివ్వమని ప్రార్థిస్తున్నాను ఎందుకు ఘోరింకా ఆలోచిస్తున్నారు? యేమిటీ సంశయం?'

'ఏమీ లేదు బ్రహ్మదేవుడు నన్నే భార్యను చేసి నిన్ను భర్తనుచేసి వుంటే ఎంత బాగుండి పోయేది అని '

అలివేలుకి కోపమొచ్చి యింట్లోకి వెళ్లిపోయింది తరువాత వాళ్లు మాట్లాడుకోలేదు అరగంట పేపు అలివేలే ఆ యుద్ధాన్ని రాజీలోకి తెచ్చే ఉద్రేకంతో 'ఇదుగో, మిమ్మల్నే, మన యీవాదనలో కూరల మనిషి కేక వినిపించుకోలేదు కూరలేటంచి బజారుకెళ్లి ఎట్లా తెస్తారో చూస్తాను!' అంది అహోబలరావు పంచెపుచ్చుకు పెరటిలో కొచ్చి 'ఎట్లా తెస్తానో చూస్తుందిట నాకేమి అంత లౌకిక జ్ఞానం తక్కువా?' అంటూ మార్కెట్టు వరకూ సాగిపోయాడు విసా విసా నడుస్తూ యిలా అనుకున్నాడు ఏదన్నా హెచ్చు తగ్గులవుతే అలివేలు తప్పకుండా దెప్పుతుంది కూరలవాళ్లు తనది క్రొత్త మొహమని ధరలెక్కువ చెబుతారో, తప్పుడు తూకాలు తూస్తారో—అట్లాటివేమీ తన దగ్గిరా? హనుమంతుడిముందు ఎవరన్నా కుప్పిగంతులు వెయ్యగలరా? ఇట్లా అనుకున్నప్పుడు చొరచుకొచ్చిన ఆవేశంతో ఎదురుగుండా కనిపిస్తూన్న ఒకటి రెండుకూరల దుకాణాల ప్రక్కనుంచి ఖాళీసంచీ నలుగురి కన్పించేలా వూపుకుంటూ ఒకసారి నడిచాడు అమ్మకం జోరులో— కోటైపునుంచి గోనెక్రిందకు డబ్బులు, నోట్లు, వెళ్లివస్తూండగా అటువంటి మంచి దర్జాలో చేరగిల్లి గంపలమీదకు యీగల్ని తరుముతూన్నవ్వాడు, లేచి 'రండి' అని అహోబలరావును ఎదురు

గర్భాలను నమ్మరాని శాస్త్రాలు భోజనాదికాలు పూర్తిచేసుకునే వేళ కొందరమ్మాయిలు లప్పాలే ముత్తాబులకు చివరితీర్పు ల్నిచ్చే సమయం విజయను గుండెల్లో గుబులొచ్చిపడింది. రేపు తన కాలేజీలో బులం తీరిపోతుందని తెలియని అహో బలరావు చివరి ఉపన్యాసంతను వినటాని కెళ్ళాలి వెళ్లి అక్కడ కూర్చోటానికి తనకెంత యినుములాటి కఠినహృదయం కావాలి రేపు అతను అలోలతుడా అని ఉద్యోగం పోయి యేమనుకున్నాడు అతని క్రొత్త సంసారం కాకులకి గ్రద్దలకి అవుతుంది ఆ కాకులూ గ్రద్దలూ ఎవరు? విజయగుండె దప్పున ఆగినట్లయింది

కాలేజీకి వెళ్ళటంకోసం తీసిన పుస్తకాలు బల్లమీద గిరాటువేసి చేతుల్లో ముఖాన్ని కప్పుకుని కూలబడిపోయింది కుర్చీలో విజయ కిటికీలోంచి క్రిందకు చూస్తే బజారుగోడను చార్లవేసి వుంచిన కుక్కుకొక్కిన లేడీసైకిలు 'క్రోధం బహు చెడ్డ వస్తువు సుమా' అని హెచ్చరిస్తోంది విజయ దిగాలు పడ్డ ముఖంతో అటూ యిటూ తిరుగాడుతూండ టాన్ని గమనించిన దమయంతి 'కాలేజీకి టైము కాలేదుటే—లేచి అన్నానికి రా' అని ఒకటికి రెండుమార్లు కేకేసింది విజయ లేచి వంటయింటి గుమ్మంలోకొచ్చి 'ఈవాళ కాలేజీకి ఎల్లా వెళ్లను? వెళ్ళలేనే అక్కా—' అంది కాలితో నేలను రాస్తూ సరిగ్గా యిదే సమయానికి విజయ తల్లి చిన్న కూజాబిందెను నీళ్ళతోసహా ఎత్తి కుదేసి లోనికి రొప్పుతూవచ్చి 'అదే—అదే అది వచ్చిందే— యింట్లో ఎవరూ లేరే ఎల్లాగే బాబూ!' అని కంగారుగా యిటూ అటూ చూసింది దమయంతి తెరగు మీదకు లాక్కుని వీధిలోకొచ్చింది వెనకాలే విజయ మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ కొడ రిక్కించి ముందుకు చూసింది.

గేటు తోసి తిగించి నవ్వుతూ అలివేలు 'క్రొత్త చుట్టాన్ని ప్రసాదరావుగారి మరదల్ని పరిచయం చేసుకుపోదామని వచ్చాను' అంది

దమయంతి 'రండి' అంటూ ఎదురుగా వెళ్లి 'మీవారు కాలేజీలో లెక్చరరు గదూ' అని చేయి పుచ్చుకుని మెట్లమీదనుంచి నడిపించుకెళ్లింది విజయ తల్లి కంగారుగా వెనకనుంచి విజయను జబ్బ పుచ్చుకు లాగుతోంది లోని కొచ్చెయ్యమని. విజయ తల్లిని విదల్చుకొని హాలులోకి వచ్చి పచ్చటి పసిమి రంగుఛాయతో మెరుస్తున్న అలివేలు రూపాన్ని తీర్చినట్లు కట్టిన ఆమె లేంపురంగు చీరను, ముఖాన్ని శుభసంపత్కరచిహ్నంగా దిద్దుకుంగేకరంగా కనుపిస్తున్న కుంకుమనూ, ఆశ్చర్యంతో చూడసాగింది.



దమయంతి 'ఈ అమ్మాయే. మావారి శిష్యురాలు' అంటూ పరిచయం చేయబోయింది. అలివేలు 'ఇట్టే శిష్యురాలే—విజయ కదూ మీ పేరు. మీరే కాలేజీలో పని చేస్తున్నారనుకొని మావారు పొరబడి ఒక క్లాసు వదిలేసారట నిజమేనా?' అంది నవ్వుతూ అలివేలు

విజయ 'నిజమే ' అంటూ దగ్గరగా వెళ్ళి ఆమెలోకి చూడసాగింది అలివేలు జేనికోసమా వెతుకుతూన్నట్లు చూసి 'ఏరిమీ అమ్మగారేరి? వారి యెడల కొంచెందురుసుగా ప్రవర్తించాను క్షమించమని అడగాలి' అంటూ లేచింది

అప్పటికి విజయతల్లి సొట్ట పోయినబిందెను మెల్లిగా వంకరలు తీస్తోంది అలివేలు చప్పున ఆమె రెండు చేతుల్ని పట్టుకుని 'పిన్నిగారూ! చిన్నవాళ్లను మీరు క్షమించాలి అప్పుడు కొంచెం దురుసుగా ప్రవర్తించినమాట నిజమే ఇప్పుడు మీ స్నేహం కోరివచ్చాను'

విజయ తల్లి క్రిందు మీదై 'హా హా హ్హా!' అని మాత్రం అనగలిగింది దమయంతి 'మాయిల్లు చూద్దురుగాని రండి' అంటూ వంట యింటిలోనికి తీసుకుపోయి పీటవేసి కూర్చోబెట్టి పుట్టింటా లేపూరో అన్నీ వాకబులు చేయ నారంభించింది తన పుట్టినిల్లు రాజమండ్రి అనీ తన తండ్రి హైస్కూల్లో మాస్టరనీ అన్నీ చెప్పాక విజయకేసి తిరిగి 'మిమ్మల్ని మాట్లాడించటం ఎట్లాగో నాకు తెలియడం లేదమ్మా ఎంగుకనంటే నాకు వచ్చినదరువు చాకలిపద్దుల వరకే—అంతే ఇవ్వాళమీరు బడికిపోలే నట్లుంది బడివంటి నా మొహం! కాలేజ్ అనాలికాబోలు'

విజయకిమాటు నవ్వు వచ్చింది నిజంగా. 'వొంట్లో ఏమీ బాగాలేక వెళ్ళలేదండీ' అంది.

దమయంతి కాఫీ తెచ్చియిచ్చింది విజయ దొడ్లోవని పూలుకోసుకొచ్చి 'యిందెయియ్ తీసుకోండి' అంది అలివేలు కొంచెం గంభీరంగా 'అమ్మా నేను నిజంగా నిన్నొకటి యాచించటానికి వచ్చాను ఆతిథ్యాల్ని స్వీకరించటానికి రాలేదు కాని మీ మంచి మనస్సులతో యిస్తే అది ఎట్లా కాదనను?' పూలందీసుకుంది దమయంతి 'ఎందుకండీ అట్లా అంటారు! అదిచిన్నపిల్ల దానికేం తెలుసు?' అలివేలు నవ్వి 'ఇప్పుడీమె యెంత చిన్నపిల్లో యింతకన్నా తక్కువట్ల పసిపిల్ల లోకడున్నాడు మాయింట్లో అతని చేష్టలవల్ల మీకున్నాకష్టం నష్టాలు కలిగితే మన్నించమని అడగటంకోసం వచ్చాను. అయినదిమా తెలియదు. నాకు తెలియనిది

ఆయనకు తెలిసినదల్లా ఆచదువే' అని విజయ రెండుచేతులో పుచ్చుకుని 'యీ చిన్న అక్క కోర్కెను మన్నించవా' అని అడిగింది

# 10

కాలేజీనుంచి 'ఆదరా బాదరా' యింటికొచ్చే సరికి సుమ్మానికి పెద్ద తాళం వొకటి వేసివుంది అహోబలరావుకి అటువంటి సమయంలో మొగుడనే వాడికి ఎంత కోపం వస్తుందో అంత కోపం వచ్చింది ఐతే ఆ కోపం ఎట్లాగన్నా బహిర్గతం కావాలి? మరొక అసందర్భం ఏమిటంటే 'తను ఎక్కడికీ కదల వద్దని వార్నింగ్ యిచ్చాడాయె అప్పటికీ తన మాట కాదుటతిరిగి వెళ్లిపోయింది అహోబలరావుకి బాగా తెలుసు తను అనుకున్న పని అలివేలు చేసితీరుతుం దని ఆ వాళ్ళ కొంపకు పడిపోయివుంటుంది తల్లి ఏమని చెప్పివుంటుంది తన భర్త కుద్ర తెలివితక్కువ వెధవనీ, తనే మహా గడుసుదాన్ననీ చెప్పివుంటుంది ఇవన్నీ చెప్పి ఆ అమ్మాయిని రిపోర్ట్‌ను ఉపసంహ రించుకోమని అడగటానికే వెళ్లివుంటుంది ఎంత అవ మానకరమైన పని! ఈ భూప్రపంచకంలో మొగుడనే వాడి అజమాయిషీలోవున్న ఆపది చేయకలపినపను లేవా మస్టికి కైలుదేరింది ఛీ! సుప్రసిద్ధ కాలేజీ లెక్చరరు అహోబలరావు పరువంతా మంటలో కలిసిపోయింది అయిపోయింది—యింకా కాలేజీ లెక్చరర్ ఏమిటి తను? రేపో ఎల్లుండో ఊస్టింగ్ వస్తుంది ఎందుకొచ్చిన బ్రతుకు? ఛీ! రేపు యీ వూళ్లో ఏ ఆధారాన్ని నమ్ముకుని వుండటం? అతని కళ్ల ముందు భూమి రోడ్డు రోడ్డుమీద మనుష్యులు అంతా గిరగిరా తిరుగుతున్నారు డబ్బు లేక అగ చాట్లు పడే పేదవాడి అసంఖ్యాక భారతప్రజల హీన చరిత్ర పుటలు అతని మనఃఫలకాన గబగబా కదుల్తు న్నాయ్ కేవలం హైన్యమే అతని కళ్ళముందు తాండవమాడివుంటే పరవాలేకపోయేది అటువంటి హీనస్థితి తనకు వచ్చేసినట్లే—వచ్చి ఎంతో కాలమై నట్లే ఫీలయ్యాడు అప్పుడిక అలివేలు తన చెప్పు చేతల్లోంచి కట్టలు త్రెంచుకునే ప్రమాదకరమైన వస్తువులా అతనికి గోచరించింది 'విజవేరా అబ్బాయీ!' అన్నట్లు చింతచెట్లు జడలు విరబోసు కుంటున్నాయి చీకట్లు ముసురుతున్నాయ్ అహోబల రావు పళ్లు పటపటా కొరికాడు వెర్రిఆవేశ మెత్తిపో తోంది సుమ్మంలో దతికిలబడి గుడ్లు పెద్దవి చేసుకుని మనస్సు అశాంతి క్రాంతం చేసి చూడబోగాడు అటు

వంటివాడికి మాత్రం ఏమి అవుతుంది? ఎదురుగుండా రిక్షా ఆగటం అందులోనుంచి మనుష్యులు తన వైపుకు రావటంకూడా అతనికి తెలియదు బాగా దగ్గర పావచ్చి తలుపుతాళం తీస్తుండగా తెలివొచ్చింది అహోబలరావుకి ఆ మనిషి అలివేలులా గమనించి పూచిపుచ్చుకు లెంపకాయ కొట్టాడు 'అమ్మో!' అని అలివేలు గోడమీదకు వాలింది గోడనున్న మేకు కణతలకు తగిలి గాయమేర్పడింది ఇది గమనించని అహోబలరావు 'ఎక్కడికెళ్లావే—రాక్షసీ? వెళ్ళొద్దన్నానా—అని మళ్లీ చేయెత్తాడు వెనక నుంచి అతని ఎత్తినచేతిని ఎత్తినట్లే ఒక అమృత హస్తం గట్టిగా పట్టుకుంది

అప్పుడు అహోబలరావు ఆ అమృతహస్తాన్ని తనవైపుకు త్రిప్పుకుని కళ్లలోకి కళ్లు పెట్టిచూశాడు వి జ య గప్పున చేయివదిలేసి 'వి జ యా అని పెనక్కి గెంతాడు సుమ్మందగ్గర కూలబడ్డ అలి వేలు కుడిచేత్తో కణతపాత్తుకుంటూ—'ఇక పరిహాసం చాలించండి మాశెల్కెల్ని రెండవయారు అవమా నించవలెనుకున్నారా? వచ్చి తలుపుతీసి దీపం వెయ్యండి'

అహోబలరావు కిక్కురు మనకుండా తాళం తీసిలోపల ప్రవేశించి లైటు వేశాడు అలివేలు చెంపమంచి నెత్తురు కారుతోంది విజయకోపంగా మాస్టారికేసి చూసి 'నేను వెళ్లిపోతాను అక్కయ్యా తలకు కట్టు కట్టుకో' అంది అలివేలు చేయిపుచ్చు కుని 'మరోమాటు మా సంసారాన్ని మాద్దువుగాని కాని వొక్క రాత్రివే వెళ్లలేవు దయచేసి మా రామైతు యింటివరకూ దిగబెట్టి రారూ? ఏమిటి అట్లా చిన్న బుచ్చుకున్నారే నిల్చోవాలి నాకు దెబ్బ తగిలిం దనా—యీవాళ నా కెంత ఆనందంగా వుందని ఈ బాధను నేనెంతో హాయనుంగా అనుభవిస్తాను వెళ్ళండి' అని ప్రతిమాలింది

అహోబలరావు విజయను వెంటపెట్టుకొని వెస్తున్నాడు విజయ యిక వుండబట్ట లేక యింటి దాకా వెళ్లాక 'మాస్టారూ—అలివె మిమ్మల్నెంత యిదిగా ప్రేమిస్తోందో మీకు తెలుసా?' అని అడిగింది. 'అయితేనేమీ విజయా ప్రేమ ఎట్లాటిదో నాకిప్పటికీ తెలీదు' అన్నాడు విజయ అతని ముఖానికేసి తేరి పారచూసింది. అప్పటికే అతని ముఖం చెమటలు చెంపలన్నీ తడిసిపోతున్నాయి.

నాటిక:

# నిరంతరజ్యోతి



శ్రీ వేలూరి సహజానందం

కథకుడు

"ఈ జగంబు సర్వ మేమిటి? యేమిటి? *
యేమి యీ జగం బిదెల్ల నెల్ల?
ఎవ్వరేని యిందు నెఱిగినవారున్న
విత్తగించి నాకు చెప్పరన్న"

మనుష్యుడీ ప్రశ్నను యుగ యుగాలనుంచి అడుగుతున్నాడు మనుష్యుడు కాలిడిన ప్రతిచోట ఈ ప్రశ్న ప్రతిధ్వనిస్తుంది నిబిడమైన అజ్ఞానాంధకారంలో ఈ ప్రశ్న, ఈ సత్యాన్వేషణే నిరంతర జ్యోతి గ్రీసులో సుమారు 2000 ఏళ్ల క్రితం ఈ జిజ్ఞాసతో ఉత్తేజితుడైన సోక్రటీస్ సంఘాధికారుల ఆగ్రహానికి గురి అయాడు న్యాయసభలో సోక్రటీస్ పై అభియోగం తెచ్చారు

ఒకరు సోక్రటీస్ నిరీశ్వరవాది

(పాజ్)

ఇంకొకరు తరతరాలనుంచి వస్తున్న పద్ధతులను విమర్శించి, అవహేళన చేసి, యువకులను భ్రష్టులను చేస్తున్న సంఘ విధ్వంసకుడు.

సోక్రటీస్ పౌరులారా నాపై అభియోగం విన్నారు ఇది కేవలం అయథార్థం నేను నిరీశ్వర వాదిని కాను

(పాజ్)

ఒకరు: బజార్లలో ప్రతివానిని నిలబెట్టి, వానికి జ్ఞానం లేదని నిరూపించటమే వృత్తి పెట్టుకున్న నిరీశ్వరవాదివి

సోక్రటీస్ నేను యువకులను దుర్బోధ చేస్తున్నానని నాపై నేరం మోపారు స్వార్థం కోసం ఆస్తిపాస్తులకోసం కాలం వృథా చేయకండి మీ ముఖ్య కర్తవ్యం మీ అంతరాత్మలను సుద్ధి పరచుకోటం ఇదే నే చేసే ప్రబోధం ఇది దుర్బోధా చెప్పండి

ఒకరు నీవు నిరీశ్వరవాదివని మా ఆరోపణ

సోక్రటీస్ ప్రవర్తనవలన ఈ అవిటి ప్రశ్నకు అంగబలం కలగదు మీ దేవతలను కాక వేరు దేవతలను పూజిస్తున్నాననా లేక నిరీశ్వరవాదాన్నే ప్రబోధిస్తున్నాననా మీ ఆరోపణ నేను నిరీశ్వర వాదిని కాను కాని బుద్ధిని వినియోగించమని నాబోధ (పాజ్) మీ రేశిక్ష నాకు విధించినా, నా జీవితాన్ని మటుకు నేను మార్చుకోను

ఒకరు అంతులేని అహంకారం

సోక్రటీస్ నా ప్రశ్నలవలన, చర్చలవలన తమ అజ్ఞానం బైటపడుతోందని నా ఖ్యాతి రేకులు నన్ను న్యాయసభలోకి తెచ్చారు

మరొకరు: సోక్రటీసు మర...క్ష విధింపబడింది విషపానం

(పాజ్)

సోక్రటీస్ ఈ తీర్పు నాకు ఆశ్చర్యంకాదు అత్యంత కష్టమైన పని మృత్యువునుంచి తప్పించుకోటం కాదు అన్యాయానికి దూరంగా ఉండటం నన్ను చంపినందువలన, మీ జీవితాలను విమర్శించే నా బారినుండి తప్పించుకోవచ్చునని మీ రనుకోవచ్చు కాని అది సాధ్యమూకాదు గౌరవ ప్రదమూ కాదు. ఇతరులకు హాని కల్గించి, వారిని నిర్వీర్యులను చేయటంకాదు సరైన మార్గం తమను తాము బాగుపరచుకోటం సత్యమైన మార్గం

మిత్రులు . మళ్ళీ ఎన్ని శతాబ్దాలకో ఇలాంటి మనిషి జన్మించటం. ఏమి అంతస్సు.. ఆ ముఖంలో రవ్వంతకూడా విచారంలేదు . ఈ దీన మూర్తి, మనం కపోతులం , కపోతులం ,

సోక్రటీస్ మిత్రుల శోకమాట. సత్యదర్శనానికి నేను జీవితంలోనూ చాటిల్లదు. మృత్యువులోనూ

---

* వేలూరి శివరామశాస్త్రిగారి 'ఏకాకి' నుంచి.

పాటిల్లరు. దేవతలన్నీ విస్మరించరు. నా వ్యక్తిగతమైన మూలంగా నాకేమీ హాని జరిగిందని భావించకండి నాకు మంచి చేయాలనే ఉద్దేశ్యం వారికి లేకపోయినా, వారు నాకేమీ కీడు చేయలేదు.

మిత్రులు బిడ్డలున్న తండ్రి అనూయకు రాలు భార్య వీరికది ఏమికావు?

సోక్ర నా పుత్రులు పెరిగి పెద్దయాక, ధర్మంమీదకన్న సంపత్తుమీద నా కెక్కువ మక్కువ చూపిస్తే వారిని శిక్షించండి బాధించండి ఈ ఉపకారం మీరు చేస్తే నాకూ, నా సంతానానికి మంచిచేసినవా రవుతారు.

ఒకరు విచారణ ముగిసింది మీ రిక వెళ్ళవచ్చు!

మిత్రులు సోక్రటీస్

సోక్ర మనకు వీడ్కోలు సమయం వచ్చింది ఎవరిదారిన వారు వెళ్ళక తప్పదు నేను మరణించటానికి మీరు జీవించటానికి. ఏది ఉత్కృష్టమో ఈశ్వరుని కెరుక

(పాజ్)

సోక్ర క్రి-° అప్పుడే వచ్చావు?

క్రిటో అవును ఇంకా సాంతం తెల్లవారలేదు

సోక్ర జైలుకావలాదారి నిన్ను రానిచ్చాడా?

క్రిటో: అతను నన్నెరుగును

సోక్ర మరి నన్ను లేపకుండా కూర్చున్నా వేం?

క్రిటో ఇట్టి విషమసమయంలో కూడా నువ్వు ఇంత ప్రశాంతంగా నిద్రపోవటం నాకు ఆశ్చర్యం అట్టి పవిత్ర నిద్రను భంగం చేయదలచు కోలేదు

సోక్ర: ఈ వార్ధక్యంలో మృత్యువుకు భూసి విచారించకూడదు

క్రిటో: నీకన్న ముదుసళ్లు కూడా ఇలాంటి సమయాల్లో ఖేదం పొందకుండా ఉండలేరు

సోక్ర: నిజమే మరి. నువ్వెందుకు వచ్చిందీ చెప్పలేదు.

క్రిటో. నేనిదివర కడిగిన కోరికే మళ్లీ అడుగుతున్నాను. సోక్రటీస్.. జైలునుంచి నువ్వు పారిపోవాలి.

సోక్ర: క్రిటో

క్రిటో. అవును సోక్రటీస్.. నీవు చనిపోతే పూడిలేని నష్టానికి లోనౌతున్నాను కాక, ప్రజల ఆగ్రహానికి గురవుతాను

సోక్ర ప్రజల ఆగ్రహానికి

క్రిటో అవును నిన్ను, నన్ను ఎరుగని ప్రజలు నన్ను నిందిస్తారు. డబ్బు ఖర్చు పెట్టటానికి ఇష్టం లేనందువలన నిన్ను రక్షించలేకపోయానని, నేను నిర్లిప్తుడుగా ఉన్నానని వారు అంటారు

సోక్ర క్రిటో

క్రిటో అంతకన్న అవమానం ఉందా? స్నేహితుని, అందులో నీలాంటి స్నేహితుని ప్రాణం కన్న నాకు ధనం ఎక్కువా? పారిపోవలసిందని నేను నిన్ను కోరినట్లు, నీవు తిరస్కరించినట్లు వారికి తెలియదు చెప్పినా వినరు

సోక్ర క్రిటో జనాభిప్రాయాంశురించి భయపడద్దు సత్పురుషులు ఈ సంఘటనను సరిగానే అర్థం చేసుకుంటారు వారి మాటే ప్రమాణం

క్రిటో సోక్రటీస్.

సోక్ర క్రిటో రానున్న మృత్యువునుంచి తప్పించుకొని ఎలాగో ఎక్కడో తల దాచుకుని జీవించమని నీ కోరిక.

క్రిటో అవును

సోక్ర కాని కేవలం జీవించటమే ప్రధానం కాదు అమూల్యమైనది కేవల జీవితం కాదు స్వచ్ఛ జీవితం క్రిటో అధికారులను శాసనాన్ని మోసపుచ్చటం అయుక్తమైనదని మనం ఆ అపకార్యం చెయ్యకూడదు అవునా

క్రిటో కాదని ఎలా అనగలను?

సోక్ర మనను బాధించినవారిని కూడా మనం బాధించకూడదు

క్రిటో అవును

సోక్ర: ప్రతీకారచింతను త్రోసిపుచ్చాలి.

క్రిటో అవును

సోక్ర ఈ పలాయనచింత వింతటితో విరమించు.

క్రిటో: ఇందుకు నే చెప్పగలిగిందేమీ లేదు. సోక్రటీస్..

సో(క్ర: కాంటో. క్రిటో కైతేన్నను నన్ను విడిచిపెట్టు దైవం ఏదారి చూపితే, అదే నాకు పూలబాట..

జైలరు సో(క్రటీస్

సో(క్ర జైలర్. రా నాయనా. రా

జైలర్: ఇక్కడకు చాలామంది వచ్చారు. కాని మీలాంటి సాధువు వింతవరకూ ఈ సంకెళ్లు తాకలేదు సేవంటె మీకు కోపం

సో(క్ర నువ్వంటె నాకు కోపం!

జైలరు కోపం లేదని నాకు తెలుసు ఇక్కడ ఉండేవాళ్ళకు మామూలుగా సేవంటె చాలా కోపం నన్ను తిట్టుతారు శపిస్తారు

సో(క్ర నీపై కోపం అనవసరం నీవిధి నువ్వు నిర్వర్తిస్తావు

జైలరు అధికారుల ఉత్తరువుల ప్రకారం విధమిచ్చే కఠోర కర్తవ్యం నాది ఆ దోషం నాది కాదు ఇతరులది

సో(క్ర అది గ్రహించకే నీమీద కోపప డటం

జైలరు ఈ చీకటిగుహలో చిక్కు కు పోయిన మాలాంటి వాళ్ళకు వెలుతురు చూపించటం కోసమే భగవానుడు మిమ్మల్ని ఇక్కడకు పంపింది దొంగలను, హంతకులను, వంచకులను బంధించే సంకెళ్లే మిమ్మల్ని కూడా బాధిస్తున్నయ్

సో(క్ర ఈ కారు రాళ్ళమధ్య మీ హృద యాలుకూడా పాషాణాలు అవుతాయని అంటారు కాని. నేనా మాట నమ్మను నే నిక్కడకు వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నాను ఆ గోడచాటుగా వెళ్లి నువ్వు దుఃఖించటం

జైలరు అవును సో(క్రటీస్ మాలో మాన వత్వం నశించటం సత్యమే కాని మీ ముఖ ప్రస న్నత, మీ వర్చుల ప్రబోధం వ్యతిరేకులంటే మీ కున్న సహనం ఇవన్నీ నక్షత్రాలై ప్రకాశిస్తుంటే మా చీకటిగుండెల్లోనూ వెలుగు నిండుతుంది ఓ ప్రభూ ఇదివరకు ఎంతో మందిని మృత్యు ద్వారం వద్దకు తీసుకువెళ్లాను కాని వాటన్నిటికీ క్షమిం చలేపోయినా ఈ సారికి క్షమించు.

సో(క్ర: ఇందులో నీ దోషం లేదు. నీ అప రాధం లేదు.

జైలరు: ఓ అంతర్యామీ.. ఆ పవిత్రమైన పెదవులు తాకినప్పుడు ఈ విషాన్ని అమృతం చెయ్యి. సో(క్రటీస్. జరుగనున్నదాన్ని క్షమతో సహిం చాలి.. మరి నాకు సెలవు

సో(క్ర: క్రిటో విషం తయారైతే,పరిచార కుని తెమ్మను.

క్రిటో ఎందు కంత తొందర? సో(క్రటీస్.

సో(క్ర ఎవ్వరది క్రిటో ఆ ఏడ్పు

క్రిటో నీ ఇల్లాలు పిల్లలు సో(క్రటీస్

సో(క్ర: ఆఁ ఆఁ సహనం వహించాలి. దేవగృహంలోకి వెళ్లే ముందు ఈ అపస్వరాలు స్వర్గంలో వినబడకూడదు

భార్య పాపిష్టిరాలిని ఉన్నంతకాలం మన శ్శాంతి లేకుండా రొష్టు పెట్టాను

సో(క్ర ఎందుకా ఆవేశం

భార్య అవును సంసారానికి నిష్ప్రయోజ కుడవని కత్తిలాంటి నోరు పెట్టుకుని అరిచేదాన్ని కాని కాని ఏధి ఏధిన వాడ వాడన భవికులు. దరిద్రులు, యువకులు, వృద్ధులు, పాపులు, పుణ్యా త్ములు మీకై ఘోషిస్తున్నారు

సో(క్ర విలపించకు విలపించకు

భార్య: ఇంతటి విశ్వపురుషుని ఇంట్లో పెట్టు కుని, ఇన్నాళ్లూ అవమానించాను అందుకే ఈ ఘోర శిక్ష. నాకు విషముకన్న దాహకమైన ఈ శోకాగ్ని నన్ను

సో(క్ర పిల్లలు చూడు ఎలా బెదురు తున్నారో వాళ్లు భయపడుతారు.

భార్య అవునిలాంటి తల్లిని మాకీ భయ పడరూ! క్షమించండి ఈశోధ కదేశపకమనం.

సో(క్ర నేను జీవించినన్నాళ్లు, నీకు జ్ఞాన ప్రబోధం చేయలేకపోయాను సంఘటనలూ ఊరికే రావు నీ అంతరాత్మ మేల్కొంది. ఈసమయంలో అంతకన్న నాకు కావలసిందిలేదు ఈ ఒక్కక్షణం యుగాలకు సమానం వెళ్లు పిల్లలను తీసుకో వెళ్లు.

భార్య ఎక్కడకు! ఎందుకు? నాకు నేనే విషపాత్ర. నాకు నేనే విషం పదండి. నాయన ల్లారా పదండి. శ్రీలోకానికి నా ప్రార్థన... ఇంక ఈ మహాపరాధాన్ని మరెవ్వరూ చెయ్యకండి...

(పాజ్)

సోక్ర క్రిటో చెప్పావా పరిచారకునికి

క్రిటో సోక్రటీస్ సూర్యుడింకా పడమట కొండలపైనే ఉన్నాడు. చాలామంది అలస్యంగా విషం తాగటం నే ఎరుగుదును

సోక్ర ఎందుకు ?

క్రిటో అధికారులు ఆదేశించాక కూడా, విందులారగించి, తాగి, ప్రియులతో కాలక్షేపం చేయటం నే ఎరుగుదును కాబట్టి తొందరపడవద్దు వ్యవధి ఉంది

సోక్ర అవును. క్రిటో వాళ్ళలా చేయటంలో తప్పేమీ లేదు అలస్యం చేసినందువలన ఏదో లాభిస్తుందని వారి ఆలోచన వాళ్లను నే ననుసరించటం యుక్తంకాదు ఒక క్షణం అలస్యంగా విషం తాగినందువల్ల ప్రయోజనం ఏమీ లేదు కాబట్టి నే చెప్పినట్టు చెయ్యి అదిగో జైలరు వస్తున్నాడు

జైలరు : సోక్రటీస్ ఇదిగో విషపాత్ర— విషం తాగాక, కాళ్లు బరువెక్కేంత వరకూ నడవాలి తరువాత పడుకోవాలి అప్పుడు విషం పని చేస్తుంది

సోక్ర సరి ఏది ఈ ఇటివ్వు ఆ విషపాత్ర

క్రిటో ఇతర మిత్రులు సోక్రటీస్ నీ అమృత కంఠంలో హాలాహలం

(నిట్టూర్పులు, దుఃఖారావాలు)

సోక్ర మిత్రులారా ఏమిటీ నిట్టూర్పులు దుఃఖం ఇలా! దురపిల్లుతారనేగా ఆడవాళ్ళను ముందు పంపింది. ప్రాణి ప్రశాంతంగా చనిపోవాలి ప్రశాంతంగా ఉండండి

క్రిటో అలాగే సోక్రటీస్ మనశ్శాంతిని భగ్నం చేయవద్దు ఆహా అదేమిటి కూలుతున్నాడు సో క్రటీస్ సోక్ర .

సోక్ర క్రిటో క్రిటో

క్రిటో ఏమిటి ? సోక్రటీస్ .

సోక్ర . క్రి...టో..

క్రిటో చెప్పు . సోక్రటీస్

సోక్ర : క్రిటో అస్క్లీపియస్ నాకు ఒక కోడి నిచ్చాడు అది అతనికి తిరిగివ్వలేదు నేను ఇంత వరకు .

క్రిటో : సరే.. ఇవ్వాలెందుకు ఆ సంగతి

సోక్ర కాదు క్రిటో అలా మరచిపోకూడదు మరిచ్చేస్తావా అతనికి కోడిని

క్రిటో ఇస్తాను

సోక్ర గుర్తుంచుకుంటావా?

క్రిటో తప్పక సోక్రటీస్ ఇంకేమైనా నీ అభిమతం

(పాజ్)

*ఓ జగత్పతీ! ఎవ్వరెనీ జగాన నీ ఎరుక లేక శోకము నించినారె ఏటికీ యంత్రువులు నీదు సృష్టియంగు

కథకుడు సోక్రటీస్ నుంచి జవాబు రాలేదు. ఒక జిజ్ఞాసువు అస్తమించాడు అతను లోటి వారికి జ్ఞానమార్గము చూపగా, వారతనికి మృత్యు ద్వారం చూపించారు కాని జ్ఞానయాత్ర మృత్యు ద్వారం వద్ద ఆగదు అది అమర యాత్ర

* * * *

ఒకడు అసురుల కాలమెప్పుడో అనుకున్నాం

ఇంకొకడు గ్రామ గ్రామం భయంలో అట్టుడికి పోతోంది అంగుళీమాల చక్రవర్తి వస్తున్నాడంటె, రాజవాలదూరంలో భూకంపంలో లాగా ప్రజలు కంపిస్తున్నారు

ఒకరు ఇలాంటి కిరాతకుని బుద్ధభగవానుడు మార్చబోవటం ఈ శాంతి దేవుని ఆ రాక్షసుడేం చేస్తాడో

ఇంకొకరు బుద్ధభగవానుడు ఆ దురాత్ముని మార్చలేవును అయ్యయ్యో ఆ ప్రేమస్వరూపుని అహింసాత్ముకునేం చేస్తాడో

బుద్ధుడు అంగుళీ మాలాలంకృత చక్రవర్తి శుభం

చక్రవర్తి : ఎవరది ? నా దర్బారున ఈ కాషాయములకు తావులేదు.

బుద్ధు కాని నా హృదయమున ఎట్టి అహంపతి కునకైనా తావుఉంది.

* తెలారి చంద్రశేఖరంగారి 'సశేషుణ'లోంచి

చక్ర ఈ నటన నాటకమంతా వృథా.. ఇట్టి మాయ మాటలతో నన్ను మోసపుచ్చలేవు

బుద్ధ వంచనకు విరోధిని నేను. ప్రభూ సత్యానికే నా ప్రణామము

చక్ర సత్యమని మిథ్యయని

బుద్ధ మీరు సత్యానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు మీరు సల్పుతున్న హింస మీ మానవత్వానికి కళంకము

చక్ర ప్రతిపక్షులను నాశంచేసిన వీరాధివీరునితో నువ్వు మాట్లాడుతున్నావని తెలుసుకో వెంటనే నువ్విచటనుంచి నిష్క్రమించటం మంచిది లేదా

బుద్ధ భయానికి అపరిచితుడు బుద్ధుడు

చక్ర ఏమి నీ అహంకారము ఈ ఖడ్గముతో

బుద్ధ సంకోచమెందుకు నా హృదయము మీ ఖడ్గము నాహ్వానించుచున్నది

చక్ర ఏమిటి? నా కనుల నేదో కొత్త కాంతి

బుద్ధ : మరల ఆలోచన ఎందుకు? ఇదిగో నా శిరస్సు

(పాజ్)

బుద్ధ ఇదేమి ప్రభూ ఒక సామాన్య భిక్షుకుని పాదాలపై మహాచక్రవర్తి, భటు లేమను కొనెదరు సామ్రాట్

చక్ర ఇవి పాదాలు కావు. జ్యోతిబింబాలు

బుద్ధుడు నేను భిక్షుకుణ్ణి ప్రభూ!

చక్రవర్తి కాదు. విశ్వదాతవు నువ్వు ప్రభువు నీవు! ఏది ఆ విమలనయనాల నొకసారి చూడనిమ్ము స్వచ్ఛదర్పణములై నా వికృత స్వరూపాన్ని నాకు చూపిస్తున్నాయి. క్షమించు నా అత్యాచారం

బుద్ధుడు అదిగో అటు చూడు కళింగ ప్రాణు లెలా ప్రణాములై వస్తున్నారో

చక్రవర్తి : వారి కలకోటి కంఠాలనుంచి వెలువడే ఆక్రందనలకన్న పెక్కు పెట్టున ప్రతిధ్వనిస్తున్నది: అంతరాత్మయొక్క దుఃఖారావము..

* వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' నుండి

మెదలోని అంగుళీయాల అగ్నికణములరై అణువు అణువును దహిస్తోంది ఈ హింసోన్మాదానికి మార్గం లేదా ప్రభూ!

బుద్ధుడు బౌద్ధజగమున శాపులేని ప్రాణి లేదు. ఏ గడపవద్దనైన తిరస్కార ముండదు గాక కానికరుణా దేవి ఇంటివద్ద ఆహ్వానము తప్ప తిరస్కారము లేదు అహింసా పరమో ధర్మః, ఇదే జీవిత పథం

* "ఆ లుంబిని పుణ్యారామంబున
వెలసిన యీ విమలజ్యోతికి,
నిరతము నేచెను నీ హృదయంబున
జయమని మ్రోగుత ఓ జగమా!
జన్మవ్యాధి జరామృత్యువుల
బారగ ద్రోలెడు బాటను దెలిపిన
కరుణామయుడౌ శ్రీ గౌతమ దేవుని
చరణము లంటవె రావో జగమా!
శ్రీ మహామైత్రీమూర్తికి జేజే!
అష్టాంగిక పథవర్తికి జేజే!
ధర్మచక్రప్రవర్తక! జేజే!
కర్మచక్రనివర్తక! జేజే!"

* * *

మొదటి వ్యక్తి ఏమిటీ కోలాహలం

రెండవ వ్యక్తి పరుగులెత్తుతున్న జనం ఎవ్వరు

మూడవ వ్యక్తి ఎవ రా సైనికదళం

4 వ వ్యక్తి అదా ఇదక్కడి చిత్రవధ పురుటిల్లు దూరి పసికూనల దంపుట

5 వ వ్యక్తి శిశుహత్య ఎవ్వరి రాక్షసమాజ

6 వ వ్యక్తి దిగ్గర గా అవకు

3 వ వ్యక్తి · పల్లెపల్లెన శిశువుల దంపటమే వీరి పాపసత్కృత్యం

4 వ వ్యక్తి హెరోదు ప్రభువు చేసిన కఠోర ఆజ్ఞ

3 వ వ్యక్తి : తన మరణానికి విధించిన జాతి తిరిగి జన్మిస్తాడని అతని భయం అందుకనే కళ్లు తెరవని పసిపాపలను సైతం చంపిస్తున్నాడు.

(సైనిక కోలాహలం విశ్వద్ధం పసిపిల్లవాని ఏడ్పు )

ఆకాశమంది శుభం—శుభం..(పరమ పవిత్ర పథురాజ [illegible]

ఒకరు: ఈశ్వరపుత్రుడనని చెప్పుకొంటున్న ద్రోహి

న్యాయాధికారి: ఇతనేనా ఈశ్వరపుత్రుడు

ఒకరు: పలుచోట్ల ఈతనిదే చేస్తున్న దుర్మార్గ

అందరూ: ఈ మహాపరాధానికి శిక్ష మరణమే

ఒకరు: పైలేట్! రాజద్రోహి ఇతడు

పైలేటు: ఎవరీతడు? ఇతని అపరాధ మేమిటి?

అంతా: జాతిని తన బోధలతో భ్రష్టం పరుస్తున్నాడు. చక్రవర్తి సీజరుకు సుంకం చెల్లించవద్దని వారిస్తున్నాడు

ఒకడు: ఇతను తానే ఈశ్వరపుత్రుడనని చెప్పుకుంటున్నాడు యూదుల చక్రవర్తినని విర్రవీగుతున్నాడు

ఇంకొకరు: అది అన్యాయం అనవసర కోపం తాను ఈ రాజ్యానికి ప్రభువునని ఎప్పుడూ చెప్పుకోలేదతను అతని సామ్రాజ్యము ఈ నేలలకు చెందినది కాదు అంతరాత్మల అనంత సామ్రాజ్యమునకు అతను ప్రభువు ఇదీ నిజం ఇదీ సత్యం

పైలేటు: సత్యమంటే ఏమిటి?

(నిశ్శబ్దం)

పైలేటు: ఇతనిలో నాకు దోషమేమీ కనపడలేదు

అందరు: ప్రజల నుద్రేకపరచి, సంచలనం తెస్తున్నాడు

పైలేటు: అన్నట్లు ఇవ్వాళ ఉత్సవపు రోజు కదూ! మరి ఈనాడు ఒక నిర్బంధితుని విడుదల చెయ్యాలి కదూ ఈ యువకుడిని

అందరూ: వద్దు, వద్దు ఇతన్ని విడుదల చెయ్యవద్దు బారబ్బాస్ దొంగల నాయకుడు అతడు ఎరుగున్న దొంగ ఇతడు అద్భుత వ్యక్తి! బారబ్బాస్‌ను విడుదల చెయ్యండి.

పైలేటు: ఇతన్నేం చేసేది?

అందరూ: సిలువమీద మరణం అదే తగిన శిక్ష. (ఉద్రేకపు గొంతుతో)

* * *

పైలేటు: సిలువమీద మరణం. ఏం చెయ్యను లోకాడని అయినా! ఘోరశిక్ష!

అంతా: సిలువమీద మరణం. ఈశ్వర పుత్రునికి మరణశిక్ష.

ఒకరు: కృశించిన ప్రేమమూర్తి. సిలువ మోయలేక పోతున్నాడు

ఇంకొకరు: మనందరమూ చేస్తున్న ఈ మహాపాపానికి రక్తంతో ప్రాయశ్చిత్తము. నేను మోస్తాను సిలువను

* * *

ఒకరు: మరి రెండు సిలువలున్నవి

ఇంకొకరు: ఇద్దరు దొంగలకు కూడా ఇవ్వాళ మరణశిక్ష

ఒకదొంగ: ఈశ్వర పుత్రుడుకూడా మన దగ్గరకే వచ్చాడు ఓ ఈశ్వరపుత్రుడా, నువ్వే ఈశ్వర పుత్రుడవయితే, నిన్ను రక్షించుకుని, మమ్మల్ని కూడా రక్షించు

రెండవదొంగ: ఛీ, సిగ్గులేదురా నీకు, మనం చేసిన పాపకృత్యాలకు ఈ శిక్షలు మనకు సహజమే కాని ఇతను సర్వమూర్తి ప్రేమమయుడు ఓ ప్రభూ, నువ్వు నీ సామ్రాజ్యంలో అడుగు పెట్టినప్పుడు ఈ పాపిని కూడా గుర్తుంచుకో!!

కొందరు: ఈశ్వర పుత్రుడు, విమోచకుడట, అయితే ఆ ఈశ్వరుడు వచ్చి, ఈ కొడుకుని రక్షించడేం?

ఆకాశవాణి: ఓ విశ్వేశ్వరా, వీరు నిరోధులు కాని వారిని క్షమించు ఇదే అతని కోర్కె. వారు అమాయకులు. వారేం చేస్తోంది వారికి తెలియదు

* * *

హింసా విహీన మనిషీ
జనహింసా విహీన మనిషీ!
పరహింసా విహీన మనిషీ!

ప్రేమమూర్తులను
హననము చేసే
ద్వేషాంధుడవో మనిషీ!
సత్యమమరము, ప్రేమ అమరము!!

కథకుడు: ఎవరు, మన విమోచకులో వారిని హింసించటం మన సంప్రదాయం... కాని మహాత్ముల సందేశం అమరమైనది లేకుంటే

దీపాన్ని ఆర్పుకొని, మళ్లీ ప్రజలు వెలుగుకోసం వెదు కుతారు

*ఎంతకాలమ్ముండియో దాంచుచున్న
వెలుగుపాదకెంచి కూడపు వీధియందు
విక్రమించి జగంబెల్ల నాక్రమించె
విశ్వపద్మంబు రేకులు వేయువిచ్చె

ఒకరు ఎవరిది ?

ఇంకొకరు ఎవరది ఒంటరిగా, నిర్భయంగా కీకారణ్యంలో వెళ్లేది ? చేతిలో చిరు ఆయుధం కూడా లేకుండా ?

ఒకరు ఓరి! తనవు మబ్బులేని నిర్మలముఖం, ఏదో బ్రహ్మ తేజస్సు! వనమృగములకన్న హింసాత్మకమైన ప్రవృత్తులావేశించిన జనసమూహముల మధ్య ఎలా నడచి పోతున్నాడు

ఒకరు దూసిన కత్తుల మరల ఒరల నిడుచున్నారు—వెలిగించిన జ్వాలలను మరల చల్లార్చుతున్నారు

ఇంకొకరు చూడుడు చూడుడు ఇది భ్రాంతా ? నిజమా ? క్షత్రియులపై కత్తులు దూసుకున్న కటికులు ఆ మహాత్ముని నీడలో కౌగలించుకొనుచున్నారు

ఒకరు ఆహా! ఎన్నియుగాలకీ పృథ్విపై ఈ పవిత్ర పాద చిహ్నాలు

హంతకుడు ప్రేమయను పేరిట, జరిగిన అవమానములకు తలొగ్గమనే ఈ మహాత్మునకు దేశానికరిష్టము ఈ వార్ధక్యంలో కూడా తన కర్తవ్య ఆదర్శాన్ని విడవాడని ఈ వృద్ధుని రంగంలోంచి తొలగించటం నా విధి.

అందరూ మహాత్మునికి అభివందనాలు

జై జై జై

హంతకుడు ఓహ్; ఎంతమంది వందలు వేలు. లక్షలు అశ్రువాహినులన్నీ ఇచట సముద్రమై, ఈ వృద్ధుని ముంచివేయగలవని భ్రమించాను. కాని తను అశ్రువులతో ఆ పాదములను కడుగుతున్నారు

---

*వేలూరి శివరామ శాస్త్రిగారి 'ఏకావళి' నుంచి.

స్త్రీలు మహాత్ముని నేత్రద్వయమునుంచి కరుణావాహినిపొంగిపొరలుతోంది. పతితులం అవమానితులం ఆర్తులం మా జోహార్లు మహాత్మునికి

హంతకుడు వీరి ఆక్రోశమేమైనది? వీరి భగ్న హృదయాల నమస్కారమేది? ఈతను ఇంద్రజాలికుడు వారి మతులను వారు విస్మరిస్తున్నారు

అందరూ మహాత్మునికి అంజలులు! ఇట్లు దహనమైనవి అస్త్రాలు నూతులైరి కాని ఓ భగవంతుడా! ఈ పుణ్యాత్ముని మాకు దక్కనివ్వు

హంతకుడు ఎవరి దైన్యం, కష్టాలు నన్నే ఘోర, అవతిక్రమ్య కృత్యానికి పురికొల్పుతున్నాయో, వారే ఏడ్పులాకి, కన్నీరు కురుచుకొని, అతని పాదధూళి చల్లుకుంటున్నారు ఈ లక్షల మందిలో నాకేని ఒక్కరూ తిరగరు

అందరూ అదిగో మహాత్ములు వస్తున్నారు ఇప్పటికే కొంచెం ఆలస్యమైంది

కొందరు వుండండి నిశ్శబ్దంగా వుండండి

హంతకుడు ఆహ్ ప్రభాత సూర్యునిలా కాదు అస్తమయ సూర్యునిలా వీని తేజస్సు కావచ్చు దివ్యతేజస్సు ఆహా! నా చేతులు పట్టు సడలినవి ఏమిది ప్రణామము మహాత్మా మీరాలస్యంగా వస్తున్నారు మీ సమయం దాటింది

(పిస్టలు పేట్ల చప్పుడు)

అందరూ ఆ! ఆ! ఏమిటీ ఘోరం

కొందరు మహాత్ముని హత్య!

ఒకరు ఎవరు ఎవరు ఈ హత్య చేసింది?

ఒకరు ఎవరా దౌర్భాగ్యుడు?

హంతకుని తల్లి · బిడ్డా! ఏం చేశావు నువ్వు?

(విచారాలు, ఏడుపు గొంతుకలు)

కథకుడు హంతకుల నిరంతరభ్రమ హత్యతో భావాన్ని చంపగలమని ఈ దుశ్చింతకు లోనై తమ జీవితాలను తాము కలుషితం చేసుకుంటారు ఆ వెలుగును వార్పాలనుకుంటారు కాని ఒక్క దిక్కున వెలుగుతున్న ఆ జ్యోతి యొక్క ప్రకాశము ఆకాశమంతటా పలుదిక్కులా వ్యాపిం

-చింది. ఇదిగదుగో ఈ తేజో బింబంవైపు చూడని, కళ్లు కోటానుకోట్లు ఇప్పుడీ జ్యోతి వెలుగులో చీకట్లను పోగొట్టుకుంటాయ్

సూర్యచంద్రాదులూ
వెలుగునంతాక
ఆరిపోనీజ్యోతి,
అమర, నిర్మలజ్యోతి,
అదిగదిగో అంతరాకాశ వీధిలో
ధ్రువతారలా వెలుగు సర్వ నిర్మల జ్యోతి
జ్ఞాన అన్వేషణే
నిత్య, నిర్మల జ్యోతి!

* * *

విభిన్న భావుకులారా! హింస నవలంబించి, ఇంక మానవ చరిత్రను రక్తసిక్తం చెయ్యకండి వచ్చింది, వెలుగుయుగం తరలింది తమోయుగం... అదిగో బుద్ధవాణి!!

"అహింసా పరమో ధర్మః"

(ఆల్ ఇండియా రేడియో సౌజన్యంతో, జనవరి 80వ తేదీన మద్రాసు రేడియో నుంచి ప్రసారితమైన నాటిక)



# ఉగాది వందనము

★

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

ముందు లుండిన నేమి మురువొప్పు లావణ్యశోభతో నిచ్చె గులాబికన్న
దంపతీ ప్రేమలో భావైక్యమును దెల్ప విరియబూచెను తోట విచికిలమ్ము
కోకిలానీకపు గొంతు చెఱను బాప కల్లవామృతమును బట్టె మావి
ప్రణయగీతమ్ములు పాడుచు మధుపూరసుమముల ముద్దాడి చొక్కె నళులు
త్రిభువనోద్దీపకుఁడు ప్రకృతిని వరించి కొలువు దీర్చె వసంతుఁడీ తెలుగుభూమి
సాంద్రవైభవవశులు, నిస్తంద్రయశులు-ఆంధ్రుల కుగాది కుతుకపు సంద్రమయ్యె!

నేలు సేయఁగఁబోయి కాళగళుని కంటివేడి మాడిన రతిప్రియుని సేవ
అమృతమ్ముకొఱకు క్షీరాబ్ధిని మథియించి కరకరులగు సురాసురుల తీరు
విప్రబలంబున వృద్ధిపొందిన బలిఁ బాతాళమున కంపు వటువు ప్రతిభ
బడుగు కుచేలుని యిడుములు వాపిన దీనబాంధవుని దాతృత్వమహిమ
తెలుఁగు దేశాన నల్లెడ వెలుఁగుచుండఁ గలిగె నందన సంతోషకలితయగుచు
ఎల్ల ప్రజకు సౌఖ్యము నావహిల్లఁజేసి తల్లియై ప్రోచు సుతుల సంఫుల్లమతిని

జీవితమ్మున తీపియు చేదు కలిసియుండు ననుమాట జ్ఞప్తియం దుండుకొఱకు
వేపపూల పచ్చడిఁ దిని పూపవయసు బాలబాలిక లుత్సాహపూల నూఁగ!

భారత భారతీచరణపంకజముల్ భజియించు సత్కళా
ధీరులఁ బెంచునందనల తీరున నందముఁ గ్రుమ్మరించుమా!
కూరిమినందనా! సుగుణకోమలభావుకు లాంధ్రపుత్రులన్
చేరుచుగూర్చి మమ్ము గరుణించుము మంచితనమ్ము బెంచుచున్.

పోటరులైన యాంధ్రులకుఁ బొత్తు పశీర్షము, నైన్యలాభమా
ఖేటమునై, సమిష్టికృషికిన్ బలిమై, మహాంధ్ర రాష్ట్రమున్
బాటిలలేదు స్పర్థలకు భాజనమై, తమలోఁ దాము గ
య్యాటము లాడుకొగలుగ అందనిమ్రాని ఫలమ్ము గాదొకో!

స్వార్థరహితులు, మహితసువ్రతులు, హితులు రాజకీయ ధురంధరులై జనాళి
ప్రేమఁబొందఁగ నైక్యత బెంచుకొనుఁడు, రాష్ట్రము లభించు, పారతంత్ర్యము నశించు!
నందన సంవత్సరమా! వందనమును గొని మహాంధ్రవత్సలవై యా
ంగము నొసగెడి రాష్ట్రము బొందగ దీవించు మమ్ము! భూషింత్రు జనుల్.

---

# జగన్నాథపండితరాయలు

## విద్వద్వాగ్గేయకారుడు

★

శ్రీ కోవ వెంకటరాయశర్మ

మనము సామాన్యముగ బూర్వుల గుణ దోషముల దెలిసికొని సమదృష్టితో వానిం దెలిసికొనలేక పోవుటయు, మన యిప్పటి స్థితికి సంబంధించిన కార్యకారణ సంబంధ మరసి దానిం దొలగించుటకు దగు సాధనాంతరముల నన్వేషింపకుండుటయు,—గారణములుగా బ్రసిద్ధపురుషుం డగు జగన్నాథ పండితరాయల గురించి తెలిసికొనజాలకున్నారము

ఇమ్మహాభాగుడు విరచించిన 'ప్రాణాభరణ' మను గ్రంథమునం గల—

"తైలంగాన్వయ మంగళాలయ మ
హాలక్ష్మీ దయా లాలిత,
శ్రీమత్పేరమభట్ట సూను రని
శం విద్వల్లలాటం తపః
సంతుష్టః కమఠాధిపస్య కవి
తా మాకర్ణ్య తద్వర్ణనం,
శ్రీమత్పండితరాజ పండిత జ
గన్నాథో వ్యధా దిదమ్ "

"పాషాణా దపి పీయూషం
స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం
లక్ష్మీకాంతం మహాగురుమ్ "

—అను ప్రస్తావములబట్టి పండితరాయలు లక్ష్మీదేవి—పేరుభట్టుల గర్భశుక్తి ముక్తాఫలంబని తెలియందగును వేగినాటి బ్రాహ్మణుడు 'ఉపద్రష్ట' గృహనామముగా గలవాడు తూర్పుగోదావరి మండలములోని 'ముంగండ' అగ్రహారము నివాసము అనగా 'కోనసీమ' వాస్తవ్యుడు

ఇతడు జ్ఞానేంద్రు నొద్ద నుత్తర మీమాంసను, ఖండదేవు నొద్ద బూర్వమీమాంసను, మహేంద్రుని దగ్గఱ న్యాయ వైశేషికములను, వీరేశ్వరుని దగ్గఱ వ్యాకరణమును—అభ్యసించి సర్వవిద్యాపారంగతుం డయినట్లు 'రసగంగాధర' మందలి—

"శ్రీమద్ జ్ఞానేంద్రభిక్షో రధిగత
సకల బ్రహ్మవిద్యాప్రపంచః,
కాణాదీ రాక్షపాదీ రపి గహ
నగిరో యో మహేంద్రా దవేదీత్,
దేవాదేవా ధ్యగీష్ట స్మరహర
నగరే శాసనం జైమినీయం,
శేషాంకప్రాప్త శేషామలభణి
తి రభూ త్సర్వవిద్యా ధనో యః "

—అను వాక్యముంబట్టి విదితము కాగలదు ఈ విషయమున నితడు 'భామినీ విలాసము' లో—

"దంభః పరిమిత మంభః పిబతి
సహా కుంభసంభవోంభోధిం,
అతిరిద్యతే సుజన్మా కశ్చి
జ్జనకం నిజేన చరితేన "

—అని వ్రాసియుండుటవలన, బుట్టినంత జలమునే కుండ గ్రాగునదియు, గాని కుండయం దుద్భవించిన యగస్త్యుడు సముద్రము నంతను వాపోశనము పట్టినాడనియు నటులనే లోకములో నొకానొకడు తన నిస్తుల ప్రతిభా వ్యుత్పత్తులచే దండ్రి నధిగమించుననియు,—దెలియం దగియున్నది. ఇతని "రస గంగాధరము"న వీరత్వ, పాండిత్య, కవితా కూరత్వములు మాత్రమే గాక ధర్మశాస్త్రము, సర్వదర్శనములు,—ఇవి యవి యననేల అన్ని విషయములు సెలయేళ్ళవలె బెల్లుగువాఱి వచ్చి పడినవి పాండిత్యమును బ్రస్తావించునపుడు "రస గంగాధర" మందలి

"అపిబత్ గిరాంపతిః స్వయం
యది తాసా మధిదేవతాపివా
అయ మస్మి పురో హయానన
స్మరణోల్లంఘిత వాఙ్మయాంబుధిః "

—అను వాక్యము లక్ష్యసిద్ధిగా నగపడుచున్నది. ఇక కవితా వీరత్వమును.

"ఆమూలా ద్రత్నసానో ర్మలయ
వలయితా దాచకూలా త్పయోధే,
ర్యావంతః సంతి కావ్యప్రణయన
పటవస్తే విశంకం వదంతు,

## కులంలేని పిల్ల

[సాంఘిక నాటకం]

పినిసెట్టి శ్రీరామమూర్తి ఆదర్శ నాట్యమండలి, పాలకొల్లు వెల రూపాయి పావలా

ఇది వర్ణవిభేదాలు కూడదని నిరూపించే నవల నాటకం రచయిత అక్కడక్కడ పాటలు కూడా ప్రవేశపెట్టారు పాపన్న పంతులనే చాందసుడుంటాడు అతని కుమారుడు సుదర్శనం సుశీల అనే కులంలేని పిల్లను పెళ్ళిచేసుకుంటానని పట్టు పడతాడు తండ్రి వల్లకాదంటాడు చివరికి కొడుకు తండ్రికి ఎదురుతిరిగి సంఘోద్ధరణాదర్శంతో తాను వలచిన పిల్లనే పెళ్లిచేసుకుంటాడు

ఇది ఇలా ఉండగా సుదర్శనం చెల్లెలు విమల సుదర్శనం బావమరిది శేఖరుని పెళ్లిచేసుకోవాలని అనుకుంటుంది

పాపన్న పంతులు కొడుకు చేసినది అంగీకరించి నట్లు నటించి, ఒకనాడు హఠాత్తుగా కొత్తగా పుట్టిన శిశువును హత్యచెయ్యబోతాడు కాని సుశీల అడ్డు వస్తుంది చివరికి కత్తిపోటువల్ల సుశీల చచ్చిపోతుంది ఇది జరిగిన తరవాత పాపన్న పంతులుకు పశ్చాత్తాపం వస్తుంది చివరికి విమలా శేఖరుల పెళ్లితో నాటకం ముగిసిపోతుంది

కథఅల్లికనుబట్టిచూస్తే నాటకం చివర ఇల్లాటి అఘాయిత్యం అక్కరలేకుండానే పంతులులో పరివర్తన తీసుకురావచ్చును మొత్తంమీద ఇల్లాంటి లోపాలు నాటకకథలో అంతటా కనిపిస్తాయి

పాత్రస్వభావాలను గురించిగాని లేక ఈ నాటకంలోని పాటలను గురించిగాని అంతగా వ్రాయవలసిందేమీ లేదు

ఈనాటకంలో ఒక్క సంభాషణలు మాత్రం కొంచెం చురుగ్గా చలాకీగా సాగిపోతూంటాయి ఈ వీటివల్లనే పాఠకులీ నాటకం కొసదాకా చదువుకోవడానికి వీలవుతుంది

---

## ప్రగతి

[నాటికల సంపుటం]

ఆచార్య ఆత్రేయ, ఉదయసాహితి, గవర్నర్ పేట, గుంటూరు వెలముప్పావలా

ఇది రెండు నాటికలసంపుటి. వీనిలో మొదటిది '*Progress*' అనే ఆంగ్లనాటిక మొదటి పది పేజీలు, చివరిపేజీ చదివినతరవాత వ్రాసినదని ఆచార్య ఆత్రేయ పీఠికలో తెలియజేశారు. రెండవది కాపలావానిదీపం. ఇది హరీంద్రనాథ చటోపాధ్యాయ వ్రాసిన నాటికకు అనువాదం

ఒక శాస్త్రపరిశోధకుడు గట్టిపరిశోధన చేసి ప్రపంచం అంతా భస్మీపటలంచేసే మారణాయుధంకనిపెడతాడు అవిసంగా ప్రపంచంలో యుద్ధాలు లేకుండా చెయ్యవచ్చునని అతననుకుంటాడు కాని అతని సోదరి శాంతి ఆ చేసేదిరాక్షస కృత్యమని నిందిస్తూ పరిశోధనాగారంలోని వస్తువులన్నీ విరజిమ్మి పారేస్తుంది ఇదీ ప్రగతిలోని కథ

ఈనాటిక చాలా మంచి నాటిక కాని అనువాదకులు యథాతథంగా అనువదించక పోవడంవల్ల తెలుగు నాటిక చప్పగా తేలిపోతుంది వీరికి పూర్వమో తరవాతో తెలియదుగాని శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు దీన్ని అనువదించి ప్రదర్శించారు. ప్రదర్శనలోకూడా ఆనాటిక బాగా రక్తికట్టింది ఇల్లాంటి ఉత్తమనాటికలు అనువదించేటప్పుడు అనువాదకులు తగినంత శ్రద్ధతీసుకోకపోతే—చివరికి మూల రచయితకే అన్యాయం జరుగుతుంది

ఇక రెండోనాటికలో అనువాదం చురుకైన సంభాషణలతో సాఫీగా చక్కగా నడిచిపోయింది

---

## శైవసర్వస్వము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు. ఈమని వయా దుగ్గిరాల, గుంటూరుజిల్లా వెల 3-8-0

ఇది శైవుల ఆచారవ్యవహారాలు, ధర్మాధర్మాలు, శైవవేదాంతము మొదలయిన విషయాలను గురించిన గ్రంథము రచయిత ప్రమాణపరిచ్ఛేదము అనేవిభాగంలో శాంభవదీక్ష స్వీకరించే విధానము, సప్రమాణంగా వివరించారు

దీనిలో రెండోవిభాగం ఆచరణాచారదీపిక దీనిలో రచయిత భస్మధారణాది విధానాలన్నీ విపులంగా వివరించాడు

అటుపిమ్మట శాంభవీయ ధర్మసూత్రావళి విభాగంలో శైవధర్మసూత్ర గ్రంథాలనుండి సేకరించిన ప్రామాణిక సూక్తులతో శైవధర్మాలనుగూర్చి చేసిన కూలంకష చర్చ కనిపిస్తుంది నాలుగవది చారిత్రికమైన శైవజ్యోతి అనే అధ్యాయము రచయిత దీనిలో సంగ్రహంగా శైవమతచరిత్ర వ్రాశారు

అయితే ఇది మొట్టమొదటే చెప్పుకుంటే పాఠకులకు ఈ గ్రంథం ఇంకా సులభసాధ్యంగా ఉండేది. మున్ముందున్న సంస్కృతశ్లోకాలు మొదలైనవి

ఎక్కువగా ఉదాహరించడంవల్ల కూడా సామాన్య పాఠకుల కీ పుస్తకం చదవడం దుష్కరం అవుతుంది.

అయితే శైవసంప్రదాయాన్ని గురించి సంగ్రహంగా తెలుసుకోదలచినవారికి మాత్రం ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది. పుస్తక ముద్రణాదికం చక్కగా ఉన్నది.

---

Journal of Andhra Historical Reserch Society
Vol XIX July 1948 to 1949 April

ఇది శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారి షష్టిపూర్తి సందర్భంలో ప్రకటించిన సంచిక.

దీనిలో శ్రీ కేపీ రామేశం, శ్రీ టి యన్ రామచంద్రన్, శ్రీ దినేశ చంద్రసర్కార్, డాక్టర్ వి యస్ అగ్రవాల్, ప్రొఫెసర్ ఆర్. సుబ్బారావు, శ్రీమతి వి యశోదాదేవి మొదలయిన ప్రముఖ చరిత్ర పరిశోధకుల వ్యాసాలున్నాయి. వీటిలో ఒక 6 వ్యాసాలు టి యన్. రామచంద్రన్ గారు వ్రాసినవి. మిగిలినవాటిలో మరి నాలుగు వ్యాసాలు శ్రీ కేపీ రామేశంగారు రచించినవి. మిగిలినవాటిలో రెండు శ్రీ దినేశ్ చంద్ర సర్కార్ వ్రాసినవి.

ఈ రచయితల వ్యాసాలన్నీ చరిత్ర పరిశోధకులకు, ప్రాచీ-భారతీయ చరిత్ర పరిశోధకులకు బాగా ఉపయోగించేవే. అయితే విషయవైవిధ్యంతోపాటు రచయితృవైవిధ్యం కూడా ఉంటే ఈ సంచిక ఇంకా ఆకర్షకంగా ఉండేది.

11 వ శతాబ్ది మొదలుకొని 15 వ శతాబ్ది అంతంవరకు పరిపాలించిన కొన్ని ఆంధ్రదేశీయ రాజవంశాలను గూర్చి శ్రీమతి యశోదాదేవి గారు రచించిన వ్యాసం ఆంధ్రదేశ చరిత్రాభిమానులకు, అందులోను సంగ్రహంగా ఆకాలపు చరిత్ర తెలుసుకోగోరే పాఠకులకు బాగా ఉపయోగిస్తుంది.

ఈ పత్రిక చిరకాలంనించి ఆంధ్రదేశ చరిత్ర పరిశోధకుల కెంతో సహాయకారిగా ఉంటున్నది. ఇలాంటి పత్రిక ఒక సంవత్సరంలో రావలసిన 4 సంచికలకు బదులు ఒక్కటే సంచిక ప్రకటించడం చాలా విచారకరమైన విషయం. తగినంత ధనసహాయం లేకపోవడమూ, మొదలైనవి దీనికి కారణాలయితే కావచ్చును. ఇది ఇటీవల భారతదేశంలో నే కాక విదేశీయుల మన్ననలు కూడా అందుకుంటూన్నదని తెలుస్తున్నది.

సంపాదకులు, పాఠకులు ఈ పత్రిక అభివృద్ధికి ఇంకా ఎక్కువగా సహకరించగలరనీ, అవిధంగా ఆంధ్రదేశీయ చరిత్రపరిశోధనకు చేయూత ఇవ్వగలరనీ ఆశిస్తున్నాను.

---

## ర మ ణ స్మ ర ణ

రామచంద్ర కౌండిన్య ప్రాప్తిస్థానము కాళహస్తి రామనాథముగారు, ట్రంకురోడ్డు, నెల్లూరు వెల ౮ అణాలు

ఇది రమణమహర్షిపై రామచంద్ర కౌండిన్య రచించిన కొన్ని చిన్న గీతికల సంపుటి. ఇందులో రచయిత రమణమహర్షి వ్రాసిన కొన్ని తమిళరచనలకు తాము చేసిన అనువాదాలు కూడా చేర్చారు.

ఈ రచనలలో కవిత్వశక్తి అంతగా కనబడకపోవచ్చునుగాని, పదాలమాటు నుండి రచయిత వినయం స్పష్టంగా కనిపిస్తుంది.

'పరిదేవన' అనే శీర్షికలోని ఈ క్రింది పద్యం వీరి కవితాధోరణికి తార్కాణంగా తీసుకోవచ్చును.

ఓసి కనుగోవలంగు మానసింపవి
మాడ్కి విలంగులో మధో
ద్రేకమొ, పాపోద్గమమొ
తెల్లము సేయగదయ్య! మామకా
ప్రోకరుణావివర్జనా,
న్యాత్మకృప దీర్ఘనా, కోణవైవహ
వాక మహిమ్న తేజ! పరిభావిత
భావజ! మానితల్లజా!

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.



# ఆనందమయమైన గృహజీవనం

అతని ముఖం ఆనందముతో ప్రకాశిస్తున్నది ఆమె ప్రేమతో తయారు చేసిన 'టీ' ఒక గ్లాసు త్రాగడం అప్పుడే ముగించాడు పగలల్లా ఆఫీసులో పనివల్ల వచ్చిన అలసట పూర్తిగా అదృశ్యమైపోయినది ఇక ఇప్పుడు అతడు చేయవలసినది కులాసాగా భార్యతో కబుర్లు చెప్పడం పిల్లలతో ఆడుకోవడం

ప్రతిసాయంత్రమూ ఒక గ్లాసుడు టీ తో భర్తను ఆహ్వానించి అతనిని ఆమె పేద దీరుస్తుంది సుఖమయమైన సంసార జీవనం గడపడానికి అతనికి అంతకంటే ఏం కావాలి? ఉల్లాసాన్నిచ్చే మంచి టీ' తయారు చేయడం ఎంత సులభం! ఇక ఖర్చు విషయమా చాలా స్వల్పం. వ్యవధికూడ ఎక్కువ అక్కరలేదు

పేద దీర్చే రుచికరమైన 'టీ' ని ప్రతి రోజూ త్రాగండి.

మంత్ర శక్తి నిచ్చే పానీయం
"టీ" త్రాగండి



సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.